# ప్రమీలార్జునీయము.

(ఐదంకముల నాటకము)

గ్రంథకర్త:

## మద్దూరి శ్రీరామమూర్తికవి.

మొదటికూర్పు 2000 ప్రతులు.

పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,

సత్యనారాయణ బుక్ డిపో.

ఇన్నీసుపేట, రాజమండ్రి.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

 1933. [వెల 1—0—0

# ప్రమీలార్జునీయము.

(ఐదంకముల నాటకము)

గ్రంథకర్త:

మద్దూరి శ్రీరామమూర్తికవి.

పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య

సత్యనారాయణ బుక్ డిపో.

ఇన్నీసుపేట, రాజమండ్రి.

మొదటికూర్పు 2000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1933.

 [వెల 1—0—0.

# పీఠిక.

పాఠకోత్తములారా !

శ్రీమద్దూరి శ్రీరామమూర్తి కవిగారి గ్రంథములు పాఠకలోకమునకు చిరపరిచితములు. వీరినిగూర్చి విశేషముగ వ్రాయనక్కఱలేదు. వీరి రామదాసు, విష్ణులీలలు, మొదలగునవి కవివర్యులను దలలాడింప జేసినవి. ఈ 'ప్రమీలార్జునీయము' వీరి నాటకములన్నిటిలో మిన్నయని చెప్పకతప్పదు. ఇది రంగస్థలమున కనుకూలమగునట్లును మూడుగంటలలో ప్రదర్శించుటకు వీలగునట్లును వ్రాయబడినది. ప్రదర్శనమునకు కష్టమగు రంగములు లేకపోవుటచే నీనాటకము రంగస్థలిని ప్రయోగింపబడుట సులభము. రసాస్వాదనతత్పరులగు పాఠకాగ్రేసరులచేతఁ నభినయసమర్థులగు నటకావతంసులచేతను నీనాటకరాజమెంతయు నాదరింపదగినదని నాయాశయము.

ఇట్లు,

విశ్వమాని కాళిదాసు బి. ఏ.

# ఈనాటకమున వచ్చుపాత్రలు.



## పురుషులు.

1. ధర్మరాజు.
2. భీముడు.
3. అర్జునుఁడు.
4. సుమతి.
5. మేఘనాధుఁడు.
6. గదుఁడు.
7. సాంబుడు.
8. ప్రద్యుమ్నుఁడు.
9. వృషకేతుఁడు.
10. సాత్యకి.
11. నకులుఁడు.
12. సహాదేవుఁడు.

## స్త్రీలు.

1. ప్రమీల.
2. స్వర్ణలత.
3. లవంగలత.
4. మాలతి.
5. మంజరి.
6. మంజువాణి.
7. చిత్రరేఖ.

శ్రీరస్తు.

# ప్రమీలార్జునీయము.

## ప్రథమాంకము.

స్థలము:—అర్జును నంతఃపురము.

[ప్రవేశము—అర్జునుఁడు.]

అర్జు—(విషాదమున.)

చ. సమధికశౌర్యమూర్తి రణ । శాస్త్రవిశారదుఁ డఖిలాస్త్రవేది యు
ద్ధమున చలింపకే నిలచు । దండిమగండు పరాక్రమంబుచే
నమరులనైన లెక్కగొన । డట్టిసహోదరుఁ బట్టి రాజ్యలో
భమున వధించి ఘోరమగు । పాతకమార్జన జేసికొంటిగా!

పాదాభివందన మాచరింపవలసిన యగ్రజునిపై పగబూని పట్టి యన్యాయముగ వధించితినే. ధార్తరాష్ట్రులపై మమ్ములను వారణావతంబున లక్కయింటనిడి కాల్పనెంచిన యాపాపకర్ములపై మాయాదురోదరంబున రాజ్యసర్వస్వము గెలుపొందిన యాదానవులపై, నిండుసభయందేకవసనయైన యిల్లాలి కొప్పుపట్టియీడ్చిన యాదుశ్శాసనపాతకునిపై దురభిమానంపుపేర్మి నిల్లాలిని తనతొడ గూర్చుండరమ్మని కనుసైగచేసిన యాకురుగోత్రనాథునిపై కినికగ నాసోదరునిపైగల్గెనే. పగసాధించువలె కర్ణునిశ లక్ష్యసాధనమున

మూని పరితపించితినే, కట్టా! పూజింపవలసిన యగ్రజన్ముని వధింప, నెంతయాతురపడి యుంటిని. పాశుపతాస్త్ర లాభంబునకై యెంతగా పరితపించితిని. ఆమహామహుని పై పగసాధించితిని, పాపమార్జించుకొంటిని. అక్కటకటా! ఆగుణరత్నాకరుండు సోదరుడగునని యొకింత దెలిసిన చతుస్సముద్రముద్రితధరణీతలంబంతయు సాధించి యాతనిపదసరోజములకర్పించి సేవకుడనై మెలగియుందునే. ఆతని జననరహస్యము సంపూర్ణముగ నెఱింగిన భీష్మాదులలో నొక్కరైన నాకీవిషయమును దెలుపరైరి. ఇంతవఱకేల? తన జన్మరహస్యమెఱింగిన యమ్మహోదారుడుగూడ నజ్ఞులమగు మే మాతని సూతసూనుడవని కేరడ మాడు నప్పుడైన సహించి యూరకుండెనేగాని నిజమెఱింగింపడయ్యెనే. రాయబారమున కేగిన కృష్ణుఁడాతని మాతోగలియు రమ్మని ప్రార్థించెనేగాని మాకీసంగతి దెల్పియుండినయెడ నీ కురుక్షేత్రయుద్ధమే లేకుండబోవునుగదా! ఇదంతయును కృష్ణునిపన్నుగడ కంటె వేరులేదు. కృష్ణా! ఎంతమోసగాడవు. యుద్ధమే వలదని మొత్తుకొను నాకేదో వెట్టివేదాంతముపదేశించి పురికొల్పి యుద్ధమున పెక్కురు బంధుమిత్రాదుల జంపించితివి. ఆపాపఫలమంతయు నాపై బడవైచితివి. కృష్ణా! నీవేమో మేలొనగూర్చువాడవని తలంచితినిగాని పయోముఖవిషకుంభమువంటివాడవని తలంపనైతిని. నీవాడించినట్లాడినకతంబుననే నాకిట్టిపాటుగల్గె......అహా! ఏమనుచుంటిని. జగన్నాటక సూత్రధారుండగు శ్రీకృష్ణునే దూరుచుంటినే. ఆతడేమి చేసెను. సుగుణార్ణవుండైన యాకర్ణుడే మాకు తన జన్మరహస్యమును దెలుపవలదని యాతని ప్రార్థించెనట. ఎంతటి యుదారుడు. తన్ను నమ్ముకొనియున్న ప్రభున కాశాభంగము గల్గునని గదా యట్లొనరించి తనజీవముల గోలుపోయియుండెను. ఒకరు దెలుపుటెం

దులకు. అట్టియసమాన తేజోనిధి యగ్రజుండగునంచు నొక్కనాడైన తలంపనైతిని.

ఉ. ఖండనసేయ వైరు లభి । వర్ణనసేయగ జూపునట్టి కో
దండపరియోగకౌశలము । ధార్మికబుద్ధియు గూడ కర్ణు నం
దుండుటజూచి క్షత్రియుడొ । కో యనియెంచితిగాని యగ్రజ
న్ముండగునంచు నేను దల । పోయక వ్యర్థుడనైతి నక్కటా!

భ్రాతృహంతకుడనై తత్పాపఫలంబనుభవించుదుర్విధి లలాటంబునలిఖింపబడియుండ నన్నుగ్రహింపనగునా? లోకైకవీరశిఖామణిని, సకల సద్గుణార్ణవుని, అగ్రజుని గుమిము సంపాదించుకొనిన యీ ఘోరపాపమున కింక నిష్కృతిగలదా! పొరబడుచుంటిని. ఆమహోదారుడు, నావలన వధింపబడు నంతటిహీనబలుండా? కాదు- కాదు- శల్యునిసూడుమాటలకునొచ్చి గురుశాపవశమున నస్త్రములు స్ఫురింపమి దోడ్పడ, మహేంద్రవంచితుడయి కవచకుండలముల గోల్పోయి, తనకు తానె వధింపబడెను. నేను నిమిత్తమాత్రుడనై యీమహాపాపము నార్జించుకొంటిని.

ఎట్టిపాతకములకైన పరిహారముండునుగాని భ్రాతృవధోపార్జిత పాపంబునకెట్టిపరిహారమును గలుగదు. వ్యాసాదు లశ్వమేధమొనరించిన నెట్టిపాపంబులైన పరిహారంబులగునని ధర్మజునికడ ధర్మోపన్యాసములగావించి యాతనిచే నశ్వమేధమును చేయించుటకు సంకల్పించిరట. కాని యశ్వమేధము లెన్నిగావించినను యిట్టి దురితమడంగదని యే నాయభిప్రాయము. ఇంక నాకు సద్గతిలభించుట దుస్తరము. ఏమహానుభావుని యగ్రజుండని యెఱుంగక వధించితినో యాపావను నిసంస్మరించుకొనుచు నసువులత్యజించి దివంబుననున్న యాతనిపద సరోజములవ్రాలిమన్నింపుమని ప్రార్థించువరకునుమనశ్శాంతిలభింపదు.

వా యీ శోకానలము చల్లారదు. అగ్రజా! కర్ణా! ఈభ్రాతృహంత కుని క్షమింతువా? అగ్రజా! ఇకనీలోకమున భ్రాతృహంతకుడని పేరొంది మనజాలను. నన్నునీదరి జేర్చుకొమ్ము.

(మూర్ఛిల్లును.)

(యవనిక దిగజారును.)

---

## ద్వితీయరంగము.

[ధర్మజుడశ్వమేధాశ్వమునుపూజించు చుండును. వ్యాసాదులు
వాయమును పూజించువిధానమును తెలుపుచుందురు.
భీమార్జున నకులసహదేవులు ధర్మజుని
సమీపమున నుండ తెర లేచును.]

వ్యాసుఁడు—ధర్మజా! అశ్వమునింక విడువదగినసమయ మాసన్నమైనది, ఫాలపట్టిక సిద్ధముగానున్నదిగదా?

భీము—ఇదే సిద్ధముగనున్నది.

వ్యాసు—కుమారా! ఏదీ యిందేమిలిఖింపఁబడెనో యొక్కపరివిన్పింపుము?

భీము—ఇయ్యది వాజిపేయాధ్వరసందర్భమున దేశాటనమొనరింప విడచిన యజానేయము.—

ఉ. అధ్వరదీక్షితుండగుచు । నశ్వముపంచినవాడు రాజసూ
యాధ్వరకర్త, రక్షణకు । నైచనుదెంచినవాడు తొల్లి తా
లధ్వజుడాదివీరనిక । రంబునునోంచినవాడు శూరులీ
పృధ్వినిగల్గిరేని దమ । పెంపునుజూపిహయంబుబట్టుడీ!

వ్యాసు—అర్జునా! సవనాశ్వరక్షణమునకై నీ వేగుచుంటివా? మంచిది. నిటలాక్షుని మెప్పించివరంబులుగొన్ననీవె యశ్వరక్షణమునకు

సిద్ధపడితివింక యశ్వమేధంబు సాంగముగ నెఱవేరినట్లె దలంప వలయును.

అర్జు—మహాత్ములయాశీః ప్రభావమునుండ మాకుఁ గొదువగల్గునే.

వ్యాసు—(పట్టికను గుఱ్ఱముయొక్క లలాటమునఁగట్టి యశ్వమును విడచును.)

ధర్మ—(లేచియర్జునుని చేరబిలచి) అర్జునా! సదసద్వివేకధురీణుండవైన నీకు జెప్పవలసినదేమున్నది. సాధ్యమగునంతవఱకు ప్రయత్నించి సామమున కార్యమును జక్కబఱుపయత్నింపుము. విగ్రహామెల్లయనర్థములకు మూలమనటయెఱుఁగుదువుగదా! అనివార్యమైనయెడఁగాని యుద్ధమొనరింపకుము. లెమ్ము. త్వరలో నాయుత్తమ బయలుదేరుము.

అర్జు—అగ్రజా! మీయాజ్ఞాబద్ధుండనై మెలఁగుదు. మేఘనాదాదులు నాతోజనుదెంచుటకు మీవలన నను జ్ఞగొనదల్లదెనిరీక్షించుచున్నవారు. తమరచెంచి వారలనాశీర్వదించి పంపవలయును.

ధర్మ—వారియుత్సాహమునకేనేల యాటంకము జెప్పవలయును. అహో! మరచితిని. మేఘనాదాదులతో వృషకేతుఁడు గూడ ప్రయాణమగునేమో?

సహ—వృషకేతు డెల్లరకంటె ముందంజ వేయుచున్నాడు.

భీము—ఆయుష్మంతు నెన్నివిధముల వారింపజూచినను వినకుండెను.

అర్జు—అట్టివానినిచ్చట నిల్పుటెట్లుగులకు. నాతోగొనిపోయెదను.

ధర్మ—అర్జునా! వృషకేతునెంతటి జాగరూకతతో నరసిరక్షించెదవో! మిగుల దుడుకైనవాడుసుమా!

వ్యాసు—ఇప్పటికే తడవైనది రండు. లోనికేగి వారలపయనము గావింతము.

(అందరు నిష్క్రమింతురు.)

(తెరవ్రాలును.)

---

## తృతీయరంగము.

స్థలము:- స్త్రీమండలమందలి యుద్యానవనము.

[స్వర్ణలత, చిత్రరేఖ, లవంగలత, మంజరి, మంజువాణి, మాలతి, మున్నగుస్త్రీలు కొందరు పుష్పాపచయము నొనరించుచు ననుబంధమును బాడుచు ప్రవేశింతురు.]

అనుబంధము 1.

స్వర్ణ—చెలులారా! రండు ఈలతానికుంజమున గూరుచుండి ప్రసూనముల మాలికలుగావింతము.

మంజరి—అగును! నీవలసియుంటచేగాబోలు మేమందరమును ప్రసూనదామముల గావింపవలయును.

మంజు—నీయాశ కంతములేనట్లున్నదే!

మంజరి—ఆశకంతముండునా?

లవం—రండు కూర్చుందము. కాని స్వర్ణలతా! నాశ్రయతజెంది మాలతి యెక్కుడుగా శోభిల్లుచున్నదిసుమా!

స్వర్ణ—ఆశ్రయమునఁగదా పండితలతాలలనలు శోభింతురు.

మాల—మీకు లేనియాశ్రయము నాకెట్లు లభించినది.

మంజ—మాలతీ! ఇంత మతిమాలిన దానవైతివేమి?

లవంగ—గుమ్మడికాయల దొంగయన బుజములు తడవుకొనినట్లు తానాశ్రయతకొఱకై పలవరించుట వెల్లడించుకొనుచున్నది.

మంజ—ఆమాట నిక్కమయగును.

మాల—గురువెండగింజ క్రింది నలుపెఱుంగదట. మీరుమాత్రమో!
స్వర్ణ—మాలతీ! ఇంతమాత్రమునకే రోషమా!
మంజ—మాలతీ! చూతపల్లవసమాశ్రయత నొందిన మాలతీలత జూచియైన దెలియకుంటివా?
మంజు—పరేంగితావగాహనమున్నగదా!
లవంగ—ఇంక నూరకుండుఁడు. మనమాటలకు మాలతి కోపగించు చున్నది. మంజరీ! దోహదవిశేషమందిన యశోకము పుష్పిం చినదేమో పరికించితివా?
మంజ—ప్రమీలాపదతాడనబహూకరణ మొందినగాని పుష్పింప దేమో.
స్వర్ణ—అటులైననామె నీయుపవనంబునకు గొనివత్తము.
మంజు—ఆమె యీయుపవనంబున కరుదెంచిన నీమాలతీలతాని కుంజముచు జూచి నిక్కువముగ సంతసింపగలదు.
చిత్ర—స్వయముగ పెంచినయభిమాన మూరకపోవునా?
మాల—పుక్కిటి పురాణమునబడి చేతనున్న పనివిడచితిరేమే!
లవం—ఏదీ! నీవురచించిన ప్రసవమాలిక.
చిత్ర—అంత నేర్పరియగునని తలంచితివా?
మాల—నీవగుదువు. ఇదేనేనుగూర్చిన ప్రసూనదామము.
స్వర్ణ—మాలతీ! మాటిమాటికట్లు కోపముదెచ్చుకొనెదవేల?
మంజు—స్వర్ణలతా! దానికోపముమాట యటుంచుము. నేడీమె మనకంటె ముందుగా నీపూలను దండగుచ్చినది. అందులకై మనమీమెను బహూకరింపవలెను.
లవం—మంజువాణి పల్కులు సమాదరణీయములె యగు.
మంజ—అగునీమెనొక యశ్వముపై నెక్కించి పూలహారములవైచి యుత్సవముతో రాణిచెంతకు గొనిపోవుదము.

చిత్రి—అశ్వమేదీ !

మాల—అంతటితో మీ యానందముతీరునా ? లేక మిమ్ములనుగూడ వెనుక నెక్కించుకొనవలెనా ?

లవం—చిత్రరేఖా ! అశ్వమునకే కలవ్వుగల్గునా ? చూడుమదేయొక యశ్వరాజ మీవంకకే వచ్చుచున్నది.

స్వర్ణ—మంజరీ ! మనమేగి యాయశ్వమును బట్టికొందమురమ్ము.

[స్వర్ణలత, మంజరి నిష్క్రమించియొక పత్రికనుచేకొని ప్రవేశింతురు.]

లవం—అదేమే పత్రికయొకటి గొనివచ్చుచుంటిరి.

మాల—అదియొక ప్రేమలేఖయగునేమో !

మంజ—నీయూహ సరియైనదే !

స్వర్ణ—లవంగలతా ! మనముపట్టికొనినది యొకపవనాశ్వము. ధర్మజుఁ డశ్వమేధయాగమొనరింపనెంచి భూప్రదక్షిణమాచరించి రా విడచిన యశ్వమట—

చిత్రి—ఆపత్రికలో నేమున్నదో చదువుము.

స్వర్ణ—ఇయ్యది వాజిపేయాధ్వర సందర్భమున దేశాటన మొనరింప విడువబడిన యజానేయము.

ఉ. అధ్వరదీక్షితుండగుచు । నశ్వముపంచి రాజసూ
యాధ్వరకర్త, రక్షణకు । నైచనుదెంచినవాఁడు తొల్లితా
లధ్వజుఁడాదివీరనిక । రంబునుగెల్చినవాఁడు, శూరులీ
పృథ్వినిగల్గిరేని తమ । పెంపునుజూపి హయంబు బట్టుడీ !

లోకమున కంతకును తానేశూరుఁడై నపగిది నీపత్రిక నెట్లు లిఖించియుండెనో- లోకమంతయును గొడ్డుపోయినదనియే యాతని యభిప్రాయముకాఁబోలు. శూరులున్నయెడ బట్టుడని కదా వ్రాయబడియున్నది! మాశూరత యాతనికొకింత జూపింప తలఁచియుదవినది.

చిత్ర—అశ్వము నెప్పుడుబట్టితిమో యపుడే సమయమొదవినది.

లవం—మనమీ యశ్వరాజమును ప్రమీలరాణి కర్పింతము.

[ప్రవేశము- మేఘనాధుండు మున్నగు హయపాలకులు.]

మేఘ—సతీమణులారా ! ఇట్లరుదెంచిన సవనాశ్వ మెటుపోయినదో మీరెఱింగిన దెలుపుడు.

స్వర్ణ—నీసవనాశ్వ మెటుపోయినదో మేము చెప్పవలయునా ?

లవం—హయపాలకులగు మీకనుగప్పి యశ్వమెట్లుపోగలదు.

మంజ—అదికాదే ! గుఱ్ఱముపరుగిడుచుండ వీరు మేతమేయుచుండిరి.

మేఘ—(స్వగ) ఇదేమి? వీరిట్లు మేలములాడుటకు ప్రారంభించిరి.

చిత్ర—ఏమయ్యా ! యటుదిగ్భ్రాంతిజెందినవానిగతి నిలిచితివి.

మంజ—ఆయశ్వమెటుపోయినదో తెలియదుకాని వలయునేడ నింకొక యుత్తమాశ్వము నొసంగెదము.

మేఘ—(నలుమూలల బరికించి యశ్వమునుగాంచి) ఇదేయశ్వరాజము నిటగట్టివైచి యశ్వమెటుపోయినదన నపహాస్యమాడుట కుపక్రమించిరా ? కానిండు. ఈయశ్వమునుబట్టినవారెవ్వరు- సవనాశ్వమును బట్టుట సామాన్యకార్యముగ పరిగణించితిరా!

స్వర్ణ—సామాన్యాసామాన్య విచారణల కిప్పుడవకాశము లేదు.

మేఘ—ఓకాంతామణులారా !

ఉ. ఏటికి బట్టినారలిటు । లీహయముం గ్రతువాజి బట్టి మీ
కేటికి పోగొనర్పమది । నెంచిరి యాహవమన్న పిన్న బి
డ్డాటలుగాదలంచితిరె । యర్జునుతో నని సేయజూచినన్.
చేటగునన్నమాట చెవి । జేర్చి యొకం తురగంబువీడుడీ.

లవ—అశ్వమును వదలవలయునా ? ఏమి యింత చేతకానిమాటలాడుచుంటివి.

స్వర్ణ—అశక్తతచేతనా ప్రార్థించుచుంటివి.

ప్రద్యు—(స్వగ) నాసతి రతియే త్రిజగన్మోహినియని గర్వించు నాకు నే డీసతీజనసందర్శనమున చక్కగ శృంగభంగమైనది. ఇంతి యేకాక వీరితో మాటలాడుటకె జంకుగల్గినది. (ప్రకాశముగ) కాంతామణులారా! ఇంక మీపరిహాసములకు స్వస్తి చెప్పుడు. అబలాజనులగుటచేత-

మాల—ఓహో! మేమబలలమైన నీవెంతసబలుడవో యించుక జూపక మాటలకాలయాపన మొనరింతువేల?

మంజు—మొఱగనేర్చినది కఱువనేరదనుటెఱుంగవా?

మేఘ—తరుణీమణులారా! తలకుమీరిన బరువులకు బరువిడిన చేటగుట నిక్కువము- అశ్వమునుబట్టి నిగ్రహించుట మీబోంట్ల కసాధ్యముకాన నాపలుకులాలింపుడు. అశ్వమును విడచి పెట్టుడు. లేకున్న నేమగునో యోచించుకొనుడు.

స్వర్ణ—ఏమగునో నేనుదెల్పెదను వినుము. వాక్శూరతగల మీరు నిక్కంపు శూరులునుగు మాతో ననిసేయుజాలక తురంగమును విడచి చేతులు నులుముకొనుచు వెడలిపోవుటయే యగును.

ప్రద్యు—కాంతలగుటచే నింతవరకోర్మివహించితిని. ఇక సహింపను- ఈప్రద్యుమ్నకుమారు డలిగిన నెదిరింపశక్తిగలవాడెవ్వడు-

మాల—ఓహో ప్రద్యుమ్నుడవా! భళిభళీ! నీప్రతాపమెఱుగనివారెవ్వరు. నీప్రసవబాణములకు పనికల్పింప నియ్యవి యుపవనాంగణవీధులుగావు- మనోహరనదీసైకతస్థలులు కావు- కుసుమాయుధంబులకు బెగడొందు విరహులిందెవ్వరును లేరు.

మేఘ—అటులైన యశ్వమును విడువరా!

స్వార—అయ్యాది వేరుగ వచింపవలయునా ?

మేఘ—సమరమునకు సంసిద్ధులుగండు.

స్వర్ణ—ఈ బెదిరింపు లెక్కడ నేర్చుకొంటివి.

విద్యు—మాటకు మాటదెగులనునట్లు వీరితో వాగ్వాదమొనర్చు చు కాలయాపన మొనర్పనేల ? రమ్ము యర్జునున కీసంగతి నెఱిఁగించి కర్తవ్యమునకు గడంగుదము.

మేఘ—సామవాక్యముల కార్యము సాధించు టసాధ్యమని దోచు చున్నది.

స్వర్ణ—కార్యసాధన మెట్లును యసాధ్యమే. సామమేగాదు దాన భేదములు గూడ వ్యర్థమే- బలాబలతారతమ్య విభేదమునకు యుద్ధమున్నదిసుమా !

మేఘ—ఆ ! యుద్ధముననే యిదమిత్థమని బలాబలనిర్ణయ మొన రింపక విడచువాడు గాఁడీ మేఘనాధుఁడు. విద్యున్మా! రమ్ము పోవుదము-

(మేఘనాధవిద్యున్ములు నిష్క్రమింతురు.)

మంజ - -ఈరాక్షసపీడ యిప్పటికి వదలినది.

చిత్రి—స్వర్ణలతా ! అనాలోచితముగ బలాధికునితో తగవునకు తల పడుచుంటిమిగదా ! పరిణామ మేమనునో !

లవంగ—ఏమే పిరికిమాటలాడెదవు ? ఆతఁడు బలాధికుఁడా ? మన ము హీనసత్త్వులమా ?

చిత్రి—కారణము లేక కయ్యమునకు గాలుదువ్వుచుంటిమే !

స్వర్ణ—వీరనారీవారంబునకు దలవంపులుగలుగునట్లు లిఖింపబడిన కమ్మబరికించియు కారణము లేకనే కయ్యంబునకు గాలుదువ్వితి మనుచుంటివా ?

చిత్ర—ప్రమీలరాణి యేమనునో సుంత యాలోచింపవలదా ?
మాల—నీకువలె యామెకు బిరికికండ లేదు.
మంజ—చేతకాని మగమాట లాడుట కామె పౌరుషము లేనిదికాదు.
చిత్ర—జరుగనున్నది జరుగకమానదు. ఇంక నిచ్చట జాగొనరింప నేల ? రండు రాణిచెంతకరిగి సకలమామె కెఱింగింతము.
స్వర్ణ—ఇంకను సందియము నీడెందమును వీడకుండెనే. కానిమ్మిప్పు డామె చెంతకేపోవుదము.

(నిష్క్రమింతురు తెరవ్రాలును.)

---

తురీయరంగము.

స్థలము—స్త్రీమండలరాజధానియం దొకవీధి.

[ప్రవేశము-సుమతి.]

సుమ—(ఆశ్చర్యముతో) ఏమీ పురవైభవము. చూచియానందించుటకీ రెండునేత్రములును చాలునట్లుదోపవు. గగనచుంబితములై, గ్రహగతులకవరోధము గల్గించునవియై, వెలయు నీప్రాసాదముల వైభవమిట్టిదని వక్కాణింప వేయినాలుకలుగల యాదిశేషునకైన నశక్యంబన నతిశయోక్తి కానేరదుగదా! వివిధరత్నస్థగితములై భాస్కరకిరణంబుల నుత్తేజితములై కనులకు మిరుమిట్లుగొల్పు నీసౌధముల సౌందర్య మాయమరపురంబునకైన గలుగదనవచ్చును. సముద్రాధినాథుం డీపురీనరంబును గనుగొన్న తనకు రత్నాకరనామముండుట నేతిబీరవంటిదని తలంచి శిరఃప్రకంపనమాచరింపకమానడు. ఆహా! యేనంకగనుగొన్న నయనంబులకానందము గొలుపునట్టి సుందరతరసౌధములే కానవచ్చుచున్నవి. సౌధములమాటటుంచినను యీవీధులశ్రేం

గారమే వేయిమడుంగులెక్కువగా నున్నది. పురమపూర్వ సౌందర్యమున నలరారుచుండ పురంధ్రీమణు లచ్చరలేమల మెచ్చునట్లుఁ గొనక మించులమించి వెలుంగుచుందురు. ఇంతవ ఱకు చూచినసతులెల్ల రొకరికంటె నొకరు సౌందర్యాధికులై నిలుకడఁగన్న కొ్రిక్కారు మెఱుంగులోయన నొప్పుచుండిరి. కాని యొక్క చిత్రముమాత్రమెటుజూచినను దృగ్గోచరంబ య్యెడి. ఎచ్చటదిలకించినను యేవంకగనుగొన్న నొక్కమగ పురుషైన గాన్పింపదు. ఇట్టి నవవయోవిలాసినులసౌందర్య మి ట్లడవినిగాచిన వెన్నెలవలె నిరర్థకమై చనున ట్లావిరించి యేల విధించెనోగదా? వీరిసౌందర్యముకంటె వీరివ్రవర్తనమే కడుం గడుచిత్రముగానున్నది. కంటబడినమగవానిని-బరికింప నించు కంతయైన నెఱమరికపాటి పరు. చూచినతోడనే నవ్వు— సమీపించిన సపహాస్యము—మాటాడబోయిన విలాసప్రకట నము- సిగ్గుసిగ్గు! చెప్పవచ్చినను వీరిప్రవర్తనమిట్టిదని వచించు టకే సంకోచముగానున్నది. ఈసిబ్బెతలుసిగ్గును సంపూర్ణముగ మగవారికర్పించి యపూర్వస్వాతంత్ర్యమంది యుండిరి గావల యును. లేనియెడ నింతటి స్వేచ్ఛావిహారముల కవకాశముండ దుగదా ? పురంబుననుండు సామాన్యజనంబుల గాంచినంతనె విభ్రాంతుడనై తబ్బిబ్బువడి తప్పుద్రోవలఁబడి- పరిభ్రమించు నేను- రాజోద్యోగులను- ఉద్యోగులుకారు ఉద్యోగినులను- నవనాగరిక శిఖామణులనందగు నారీరత్నములను గాంచిననట్టి విషమావస్థకు జిక్కుకొనవలసి వచ్చునోగదా ? అచ్చరలేమ ల తెఱంగున వయోవిలాసభాసురలగు నీ సతీజనంబులకేలిక యగు నాప్రమీలరాణిఁ దిలకించిన నింకెంతటి విభ్రాంతిగలు గునో గదా ? కానినాకొక్క సందియముదయించుచున్నది.

ఇంతటి విభ్రాంతికిలోనైన నేను నాతలపైనుంపబడిన యీ రాయబారము యథావిధినిర్వర్తింపజాలనని తోచుచున్నది. ఏమో ఎటుజరుగనున్నదో, ఈస్త్రీగాలిసోకిన నెంతటివాడైన నిట్టె వంచితుడగునందురట్టియెడ నాజోంట్ల మనంబు చలించుట వింతయగునా ? ఆమందిరమునుండి సౌభద్రతీదేవిరోయన నీవంకకు జనుదెంచుచుండిన యాలతాంగిని రాణిప్రమీల భవనమెచ్చటయని ప్రశ్నించెదగాక.

[ప్రవేశము-మాలతి.]

సుమ—ఓ కాంతాశిరోరత్నమా ! నేనూరికిం గ్రొత్తవాడనగుట దిక్కు దెలియకున్నది. ప్రమీలరాణి మందిరమెచ్చటనుండెనో యొకింత చెల్పి యనుగ్రహింపుము.

మాల—ఆమందిరముతో పనియున్నదా ?

సుమ—మందిరముతో పనియుండుటకు నేను చోరుడనుగాను.

మాల—ఆసంగతిదెలియును. కాని మీకచ్చటగలపనియేమి ?

సుమ—ఆ ప్రమీలరాణితో మాటలాడవలయును.

మాల—(వికటముగా నవ్వును)

సుమ—ఏమంతగా నవ్వెదవు?

మాల—(ఇంకను వికటముగా నవ్వును.)

సుమ—కొంచెము మానవ్వాపుకొనుము. పెండ్లినాడు తీరుబడిగా నవ్వ కొనవచ్చును.

మాల—(కొంచెము నవ్వాపుకొని) మాటలాడుట కా ప్రమీలరాణి యే కావలయునా? నాతో మాటలాడుచుంటివి చాలాదా ?

సుమ—(కోపమున)చాలింపుమిక నీ వికటోక్తులు.

మాల—(వికటముగ) అనుగ్రహమపేక్షించువారాగ్రహింక రందురు గదా ? మీకుకోపమువచ్చిన నింక నేనేమియు బలుకనొల్లను. సెలవు. (పోబోవును.)

సుమ—(స్వ) ఈమె వెడలిపోవుచున్నది. ఇంక నా కార్యము దీర్చుటకు దగినమార్గ మేమియును గాన్పింపదు. ఈమెనువారించి మరల యత్నించెదనుగాక. (ప్రకాశముగ) లతాంగీ !

మాల—(నిలచి) ఎందులకు?

సుమ—సవనాశ్వపాలనమునకై చనుదెంచిన యర్జునుఁడంత రాయబారినై ప్రమీలరాణితో మాటలాడవచ్చితిని. అనుగ్రహించి యామెచెంతకు గొనిపొమ్ము.

మాల—ఆసంగతి తొలుతనే యేలవచింపనైతిరి రండు. మిమ్ముల నిప్పుడ సభారంగమునకు గొనిపోయెదను. కాని నేను తమ్ము గొని వచ్చినట్లు దెలిపితిరా నాకును మీకును ముడిపెట్టుకొనునంత వఱకు రాగలదు.

సుమ—పురుష ప్రయత్నమాత్రమునకు లోపముండదు.

మాల—(చిఱునవ్వున) మంచిసరసుండవగుదువు.

సుమ—(సాభిలాషమగు చిఱునవ్వుతో) నీయట్టినెఱజాణలిచ్చిన బిరుదమూరకపోదు.

(ఇరువురు నిష్క్రమింప తెరవ్రాలును.)



# ప్రమీలార్జునీయము.



## ద్వితీయాంకము.

స్థలము:-స్త్రీమండలమున, ప్రమీలారాణి సభామందిరము.

[స్వర్ణలత, మాలతిమున్నగు కాంతలెల్లరును యుచితాసనముల నలంక రించియుందురు. ప్రమీలారాణి యొక యున్నతాసనముపై నాసీనయై యుండ పరిచారికలు ఛత్రచామరముల వీచుచుందురు.]

ప్రమీల— నేడీ యత్యవసరసభాసమావేశ మేర్పాటుచేయుటలోగల యావశ్యకత మీకెల్లరకు విశదమే. కావున ధీమతులైన మీ రెల్లరును దీవ్రముగ నాలోచించి మీయభిప్రాయముల స్పష్టముగా విశదీకరింపుడు. లవంగలతా! ఇందునుగూర్చి నీవే మందువు.

లవం— మహారాణీ! విజ్ఞాననిధియనందగు నీవు కార్యనిశ్చయమునకై మాయభిప్రాయము లెఱుంగగోరుచుండుట కడుంగడు వింతగ నున్నది. నీకంటె మేధస్సంపన్నులీత్రిజగంబులలేరని నొక్కి చెప్పవచ్చును. కేవలమీమండలమునకేగాదు. త్రిభువనపరిపాలనభారమువహించి సమర్థతతో పరిపాలింపశక్తియుక్తులుగల్గిన నీవే యవశ్యకర్తవ్యమును జూపింపవలయును గాని మాబోంట్ల కయ్యది యసాధ్యమని వక్కాణింపనగును. ఎట్లోనర్చిన

యాత్మగౌరవము నశింపకుండునో- యేపథమవలంబించిన లోకులకెల్ల స్త్రీజనంబు లుచితరీతి పోషణలంది విద్యాదికములగఱచునట్లొనరించిన పురుషుల కెందును దీసిపోవరని చాటింపబడునో-యట్లొనర్చుట వశ్యకర్తవ్యమని నీవ యెఱుంగుదువు. అయినను లోకధర్మంబుగ మా యభిప్రాయము తెలుపంగగోరితివి. కావున మాయభిప్రాయముల నిస్సందేహముగా వక్కాణింపవలసిన విధి మాయందున్నది. అందుచే నాయభిప్రాయమును విశదీకరించుచుంటిని. లోకమున ప్రస్తుత పరిస్థితులనుబట్టి చూచినయెడల పురుషులెల్లరును స్త్రీలన్న కంటగించుచు వారబలలనియు, పూరుషులతో సమానమగు మేధస్సంపదలేనివారనియు- దలంచి పాతాళమున కణగద్రొక్కవలయునని యుబలాటపడుచున్నారు. ఆపల్కులు బూటకములనియును- అబలాశబ్దము స్త్రీజనంబులయెడ నుపయోగింపదగదనియు- స్త్రీపురుషులు సమానమగు బుద్ధికౌశలముగలవారనియును లోకమున కిప్పుడు జూపింపదగు సమయమాసన్నమైనది. ఇదియును ప్రయత్నసిద్ధము గూడ కాదు. కావున మనము పట్టినయశ్వమును విడచుట లఘుకాదు. జీవములు మేననిలుచునంతకు బోరాడి యశంబునో లేక వీరస్వర్గమునో జూరగొనవలయునే గాని వేరొండుమార్గము గాన్పింపదు.

ఉ. పట్టిన యశ్వముం విడచి। పంచుటకంటెను లాఘవంబు చూ
పట్టదు కాన దేహమును। ప్రాణముపీడినదాక పోరి యు
ట్టిట్టనరాని కీర్తిగడి। యించుటొ వైరివితానుగంబులం
గిట్టి యఖండసౌఖ్యముల। కేలగ్రహించుటొ యొప్పుచూడగాం.

మనగౌరవప్రతిపత్తులు నిలుపుకొన నెంచితిమేని వలయునెడ భీషణసంగ్రామమునకేని సంసిద్ధులమై యుండవలయుననుటయే నాయభిప్రాయము. తక్కిన మిత్రులందఱు యిందలి మంచిచెడ్డ లాలోచించి కర్తవ్యమును నిరూపింతురుగాక.

ప్రమీ.—మేలు మేలు! లవంగలతా! వీరనారీశిఖామణి వైనందులకు దగినట్లుగా బల్కితివి. అభిప్రాయప్రకటన మాచరించుచు కర్తవ్యమును నిరూపించు నీపల్కులు సర్వజనసమాదరణీయము లనుటకు సందేహము లేదు స్వర్ణలతా! నీయభిప్రాయమేమి?

స్వర్ణ.—అమ్మా! నాయభిప్రాయ మెట్లున్నదో మొదటినుండియును తెల్లమగుచున్నది. అశ్వమును బట్టి కయ్యమునకు కాలుదువ్వినదానను నేనయని జెప్పుటకు లజ్జించుచున్నాను. కాని యాతురంగమముఖంబున గట్టబడినపత్రికను దిలకించినంతటినుండియు యర్జునుఁ డెంతటిశూరుఁడో కనుగొనవలయునను వాంఛ జనించినది. శిఖండిని మున్నిడుకొని భీష్ముని జంపుటయు “అశ్వత్థామా హతఃకుంజరః” అని ధర్మజుని చేబొంకించి పుత్రమరణదుఃఖతుఁడై నిర్విణ్ణుడై యున్న ద్రోణునివధించుటయు-శాపవశంబున రథచక్రంబు భూమిని దిగబడినపు డన్యాయముగ కర్ణునివధించుటయు ఘనకార్యములుగా నెంచికొని తానే వీరాధివీరుండనని ప్రకటించుకొను నాయర్జునుని పరాక్రమమేపాటిదియో యొకింత యెఱుంగ నామనముత్సహించుచున్నది. మహారాణీ! తమరాశీర్వదించి ననుబంపుడు. అయ్యర్జునుని నిముసమాత్రమున బట్టిబంధించి తమచెంతకాతని నవనాశ్వమునుదెచ్చి యర్పించునట్లు దీసికొనివచ్చెదను. వేరుగా సంగరముతో నిమిత్తములేదు. సోదరుని విడిపించుకొనుటకా

ధర్మజుఁడె స్వయముగ జనుదెంచునో-యితరశూరులబంపునో జూతము.

ప్రమీల—మేలుమేలు స్వర్ణలతా! నీపల్కులధికోత్సాహ పూరితములై వెలయుచున్నవి. నీవు నీపల్కినట్లొనరింప శక్తియుక్తులు గలదానవనుట కెట్టిసందియమును లేదు. చిత్రరేఖా! నీయభిప్రాయమేమి.

చిత్ర—మహారాణీ! నాకంటెమున్నుగ దమయభిప్రాయములను వెల్లడించిన లవంగలతాదులపల్కులు కేవలము సంగ్రామాభిలాషిణులపల్కులవలె గాన్పించుచున్నవని దెలుపవలసివచ్చినందులకు మన్నింపవలయును. ఆత్మగౌరవసంరక్షణనెపంబున నన్యులతో నకారణంబుగ నసిసేయుట మేలనితోపదు. సవనాశ్వమునుబట్టక విడచినంతమాత్రమున మనశౌర్యమునకు కొఱంతగల్గునా? హస్తినాపురమునుండి యింతదూరమీహయంబు చనుదెంచియున్నదిగదా? ఈలోపుననున్న దేశములు గొడ్డుపోయినవా? ఆదేశమునశూరులు లేరా? అట్టివారికి లేనిశౌర్యము మనయందున్నదా యను సంశము విచారణీయము. సవనాశ్వమగుటచే శూరులున్నబట్టుడని వ్రాసిరి. కాని లోకమున తామేశూరులమనియును- తమకంటె శూరులీలోకమున లేరనియు నుద్దేశించి ఫాలపట్టికలో నట్లువ్రాసియుండలేదు. మరియొక్కవిషయమునుగూర్చి విమర్శింపవలయును. యుద్ధమిరుదెగలవారికిగూడ ననర్థదాయకమైయుంఁడుననుట నిర్వివాదాంశము. కావున యుద్ధమునకేగుటకుమున్నుగ స్వపరబలతారతమ్యములు చక్కగవిమర్శించుకొనవలయును. హయపాలనమునకై చనుదెంచినవాఁడర్జునుఁడు. అతనిసామాన్యునట్లుదలం

వనలవియగును. అతని వీరవిహారలీలలిట్టివని వక్కాణింపనల వియగును.

సీ. అగ్నిదేవునకునై । యమరేంద్రుతోఁ బోరి
ఖాండవారణ్యంబు । గాల్చినాఁడు
కాలకేయాది రక్కసిమూఁక చెండాడి
యింద్రుని సరిగద్దె । నెక్కినాఁడు
వాసవుండనువని । వాతకవచులను నో
డించియశంబు నా । ర్జించినాఁడు
పురవైరితోఁ దొల్లి । పోరాడిమెప్పించి
పాశుపతాస్త్రంబు । బడసినాఁడు.
అట్టి నిఖిలాస్త్రవేది యా । యర్జునుండు
భండనమొనర్ప సిద్ధమై । గాండివంపు
గుణముమ్రోగించినను రిపు । కోటిబెదరి
జీవముల నిల్పుకొననెంచి । చెదరిపోదె.

కావున అట్టివానితోఁ బోరాడుటకు దగిన శూరశిఖామణులు మనలో నున్నయెడల యుద్ధమొనర్చుట సమంజసము. ఎంతగానాలోచించిన నాపృథాపుత్రునకీడగువారు మనయందున్నట్లు దోఁపదు. కావున జోలిమాలిసవనికేగి యపకీర్తి గడించుకొనుటకంటె యాతని కాయ శ్వమర్పించుటే యుత్తమమని తోఁచుచున్నది.

ప్రమీల—చిత్రరేఖా ! నీపల్కులు సత్యదూరము లగుననజాల నైనను తక్కుంగలవారి యభిమతము లరసినగాని యెట్టి నిర్ణయమును గావింపదగదు. మంజరీ ! నీయభిప్రాయమునుగూడ వక్కాణింపుము.

మంజ—అమ్మా! చిత్రరేఖ యుద్ధమనర్థదాయకమని భావించి తద నుకూలముగ తనయభిప్రాయమును వెలువరించియుండెను.

కాని యెవ్వరు యుద్ధమనర్థదాయకమని యెంతురో వారు భీరు లని తలంపవలయును. పరాక్రమోపార్జితజీవధనులగు వీరాధి వీరులు యుద్ధమనర్థదాయకమని పలుకుచు నర్ధానిని కొంచె పరుపజూచినవారి సమీపించుటకేగాదు చూచుటకుగూడ సంకోచింతురు పౌరుషప్రకటనమున కింతకంటె యుత్తమసాధన మింకొకటి గలదా? అయ్యది విమర్శించు టొకింత యప్రస్తుత ప్రశంసయగును. కాన నిరమించి, స్వపరబలంబు విచారించు కొని యుద్ధమున కేగవలయునని చిత్రరేఖ పల్కినపలుకులను గూర్చి యొకింత మనవిజేసికొందు. తనబలమే యెక్కుడనియు, తానే బలాధికుడననియు, తనకేజయము లభించుననియు తలం చినపుడు యుద్ధమున కేగుటకు మున్ను యాలోచింపవలసిన పనియే లేదు. పరుడే యధికబలుండైన, వీరు లెన్నడును వెనుక జవేయక యశమార్జించుటో వీరస్వర్గము లభించుటో నక్కువమని యుద్ధమునకు సంసిద్ధమగుదురు. ఇపుడు మనకు సంభవించిన యుద్ధము వీరప్రకటనమునకై యేర్పడినదిగాని, ఒకరొకరి రాజ్యము నపహరించుటకు సంకల్పింపబడినదికాదు. గనుక, నాయభిప్రాయమేమన? శూరలముగనుక యశ్వమును బట్టితిమి వారు మనకంటె బలాధికులైన నశ్వమును విడిపిం చుకొనిపోవ్రుదురు. కావున యుద్ధము చేయవలయునా మాన వలయునా అని విమర్శించు టనవసరము ఇదివరకు వారు గావించుచుండిన హయపాలకత్వము వారినుండి మనకు సంక్ర మించినది. పోరొనగూడిన యవశ్యము పోరాడి హయము మరా తులకు చిక్కకుండ రక్షింపవలయును.

ప్రమీ — అయినచో నీవు స్వర్ణలతాదుల యభిప్రాయముతో నేకీ భవింతువు. మంచిది. మంజువాణీ! నీయభిప్రాయమేమి.

మంజు—అమ్మా! ఇంతటి స్వల్పవిషయమున కింతటివిమర్శనమేల ? మనకు యుద్ధములో నిమిత్తమేమున్నది. పురివెలుపలనున్న యర్జునుని లోనికిరాకుండ పురద్వారముల మూయించితిమేని, యర్జునుడుకాదు త్రిమూర్తులెత్తివచ్చినను మనపురమును ప్రవేశింపజాలరుకదా? వారెన్నిదినములు కోటముట్టడించినను కోటగోడలలో నొక చీమతలయంత రంధ్రమైనను చేయజాలరుగదా? మన సంగతి విచారింతుముగాక; పదిహేను వత్సరములకొలంది మట్టి కలిపియున్నను పురంబునువదలి యావలికేగవలసిన నిమిత్తములు లేవుగదా? అంతఃపురవాస్తవ్యులకు తడవుకొనవలసిన పనిలేదు. సుచ్ఛిద్రములగు మంచినీటి కొకరిని యాలించవలసిన పనిలేదు. అనేకవింటితి గా! ప్రాణమువిసిగి యశ్వముంగిటి నూవలనుండి మాయమైకొనవచ్చునని యాతడేమురసెపోవును. ఇందువలన మన కేకొద్దిలాభమున్నది యుద్ధమొనర్చిన నష్టము సంభవించునేమో యను చింత లేదు. జననష్టమున కవకాశము లేదు. జయములభించునా లభింపదా యనుచింత లేదు. గాయము మన స్వాధీనమునందే యుండును. కావున యిట్లాలోచించి సుఖాయాసముగ జయంబును చేకొందమె నాయభిమతము.

ప్రమీ—నీయభిమత మువాయసహితమైనదే కావచ్చును. మాలతీ ! నీయభిప్రాయమేమి?

మాల—అమ్మా! ఇంతలో మనము త్వరపడి యుద్ధముచేయవలయునా మానవలయునా యని విమర్శించుకొననేల? అశ్వమును గోలుపోయిన యర్జునుఁడు తొలుత తానేమిసేయునో జూచుకొని, యాతఁడు త్వరపడి యుద్ధమున కాహ్వానించిన వెనుదీయక పోరాడుదము. ఆతడు మనకనుకూలమగు షరతుల

పైసంధియొనర్చుట కంగీరించిన మొదల నట్లుగావించి యుద్ధప్రస
క్తి లేక సుఖంబుందము. అశ్వమునకై తహతహజెంది యాతఁ
డే రాయబారినంపిరో స్వయముగా జనుదెంచిరో కార్య
సాధనకుపక్రమించును. ఆవిధానముగూడ జూచినపిమ్మటనే
మనము కార్యనిశ్చయమొనర్చుట మేలని నాయభిప్రాయము.
నేటరేపట యాతడు రాయబారము నడపునని తోచుచున్నది.

(తెరలో)

మహారాణీ! తమసందర్శనమునకై యెవ్వరో యర్జును చెంత
నుండి వచ్చి నిరీక్షించుచున్నవాడు.

ప్రమీల—ప్రవేశ పెట్టుము.

[ప్రవేశము విభ్రాంతిగొనిన సుమతి.]

సుమ—మహారాణీగారికి వందనములు.

ప్రమీ—ఎచ్చట నుండి నీరాక.

సుమ—మా ......

మాల—(వలదని సంజ్ఞసేయును)

సుమ—మా-అర్జునుఁడు.

ప్రమీల—ఇదేమి మాటలాడ లేకుంటివి. అర్జునుఁడెందులకు నిన్నిచ
టి కంపియుండెను.

సుమ — అశ్వమును-ఆతఁడు-కాదుకాదు. మాయశ్వమాతఁడు-కాదు
అతనియశ్వము-ఏమో జ్ఞాపకములేదు.

ప్రమీల—నుపహాస్యముచేయుటకా యిట్టి వానిని రాయబార
మునకు బంపుట.

సుమ—అవును-కాదు. (స్వగ) ఛీఛీ! నన్నావరించి విభ్రాంతిమాట
లాడనీయకున్నది. అర్జునుడొసంగిన కమ్మయైన యొసంగెద
గాక. (ఉత్తరముదీయుటకు యత్నించుచుండును.)

మాల—అమ్మా! ఈతఁడు విభ్రాంతిగొని తబ్బిబ్బుపడుచున్నట్లు దోచెడిని.

సుమ—ఉత్తరమిచ్చెను. కాదుకాదు. తత్తరపాటుత్తరమున జూపించెదను.

ప్రమీ—(నవ్వి) ఏదీ.

సుమతి—ఉత్తరమునుదీసి చూపించును.

ప్రమీల—స్వర్ణలతా! ఆయుత్తరమేమో చదివి విన్పింపుము?

స్వర్ణ—(ఉత్తరమును గైకొని.)

" శ్రీమదంగనామండల మహారాణియైన
ప్రమీలరాణికి:—

రాజసూయాధ్వరకర్తయగు యుధిష్ఠిరానుజుండగు పార్థుండు ప్రాయులేఖార్థంబులు :—

కురుక్షేత్ర మహాయుద్ధానంతరము కృతాభిషేకుండైన యుధిష్ఠిరుండు ఆత్మబాంధవ వధోపార్జిత పాపపరిహారంబుగ హయమేధమొనరింపవిడచిన యశ్వమును-మీామండలమునందలి యువతీమణులు కొందఱుబట్టి బంధించియుండిరి. వారీవఱకావృత్తాంతమునునీకు శ్రుతపరచియుందురు. అట్లువారొనరింపకున్న నీ లేఖవలననైన కలరూపునెఱింగి యశ్వమును విడచునట్లొనరింపుము. ఉపేక్షయొనరించినను-యట్లొనర్చుట కంగీకరింపకున్నను- శూరధర్మమును నెఱపి మిమ్ము నిర్జించియైన నశ్వమునువిడిపింప యత్నింపవలసియున్నది. కావున వైరివనదవానలుండగు నర్జునునిపలుకులాకర్ణించి యనవసరముగామమ్ము యుద్ధమునకు బ్రేరేపవలదు.

ఇట్లు,
పరాక్రమోపార్జితుడర్జునుడు."

ప్రమీల—(దిగ్గున లేచి) ఏమీ! శూరధర్మము నెఱపి మమ్మునిర్జించి యైన నశ్వమును విడిపింపయత్నించునా! కానిమ్ము. వైరివన దవానలుండగు వాని బాహుబలప్రకరంబు లెట్టివో నేనుగూడ పరికించిన నేగాని యశ్వమును విడువను. ఇట్టివృధాభిమానగర్వితునకు గర్వపరిహారమొనర్చినగాని నాక్రోధానలము శాంతింపదు. ఓరీ! రాయబారీ! యుద్ధమే సిద్ధమనియును- తమతమ పౌరుషంబులను బాహుబలంబులనుజూప సైన్యములప్రోత్సాహపరచిపంపుమని యాకిరీటితో బల్కుము. పొమ్ము.

సుమ—దారికాదు కాదు- పోజాలను.

ప్రమీల—మాలతీ! యీతనిసాగనంపిరమ్ము.

[మాలతిసుయోగునితో నిష్క్రమించి మరలప్రవేశించును.]

ప్రమీల—చెలులారా! వింటిరిగదా! అర్జునునిసందేశము. పెక్కురు సంగ్రామమునకు వ్వేళ్ళూరుచుండ తదనుకూలముగ కిరీటి వీరాలాపములు మీయాత్రమునకు దోహదమొసంగియుండును. మీరెల్లరును సంగ్రామవిశారదులనుటకు సందియములేదు. మీకు సమరమున నెట్లుమెలంగవలయునో బోధింపనగత్యమెంత మాత్రమును లేదు. సాధ్యమైనంతవఱకు పోరాడి- యశము చేకొనవలయు నేగాని భీరులవగిదిపగతురకు వెన్నొసంగి పరదెంచుట వీరలక్షణముగాదని తలంచుఁడు. అర్జును నెట్లెదిరించి గెల్తురో.

ఉ. ఒక్కడెపోయి చిత్రరధు । నోంచి సుయోధనుదెచ్చినాడు తా
నొక్కడె వీతిహోత్రునకు । హోమముగాగ నొసంగెఖాండవం
బొక్కడెపోయి కౌరవుల । నోంచిమరల్చెనుగోవులట్టి పే
రెక్కినవాడు పార్థు డిపు । డెట్లు రణంబొనరించి గెల్తురో.

ఉ. ద్రోణుని భీష్మునిన్ కృపుని । ద్రోణతనూజుని సూతుసూతున
క్షీణబలంబుచే గెలిచి । కీర్తిగడించినవాడు సంగర
క్షోణికినేగు దెంచె వెను । జూపక పోరియశంబుగాంచుడీ
ప్రాణము లెన్నడైన నెడ । బాయును దేహమటంచు నమ్ముడీ.

పోరుభయానకంబై మీకును స్తరమైతోచినతోడనె నాకు దెలియపర చుడు. స్వయముగ జనుదెంచి యర్జునుడెంతటి బలుండో చూచెదను- మాలతీ! నీవు పాలికలని కేగక మూరువేషమున శత్రుశిబిరమునకరిగి వారితంత్రములన్నియు సాకల్యంబుగా నెఱింగి వేగునడపుచుండుము. పొండాయుధాగారమునకు. వలయు నస్త్రశస్త్రములదాల్చి రణంబున కేగి విజయంబును గొనిరండు.

అందఱు (నమస్కరించుచు) మహాప్రసాదము.

(యవనికదిగజారును.)

---

ద్వితీయరంగము.

స్థలము:— స్త్రీమండలప్రాంతము.

[అర్జునుఁడు, మేఘనాధుఁడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు మున్నగువారందఱును యుచితాసనములపై కూర్చుండియుండగా తెరలేచును.]

మేఘ—సుమతి యిట్లుజాగొనరించుటచూడ నీతఁడాతరుణీమణుల గాంచి తబ్బిబ్బువడి తానేగిన కార్యమును మరచియుండునని తోచుచున్నది.

అర్జు—రాయబారముయొక్క పర్యవసానమెఱుంగక తత్తరపడరాదు.

సాత్య—పర్యవసానమున కేమున్నది. జగద్విఖ్యాతచారిత్రుడవగు నీవు హయపాలనమునకరుదెంచితివని వినినతోడనే తురంగము నర్పించి మన్నింపుమని ప్రార్థింతురు. వీరేగాదు మరే భూపాలు

డైనను కిరీటి నెదిరింపసాహసించునా ? అట్టివాడు మందున కైన
గాన్పింపడు.

గీ. అంబికాధవునొంచి శ । స్త్రాస్త్రవితతి
బడసినకిరీటిబంపిన । వా ర్తవినియు
యుద్ధమొనరింప నెంచు గ । ర్వోద్ధతుండు
గానబడడింక మందున । కైనగాని.

మేఘు—సాత్యకీ! ఆకాంతలసంగతి యెఱుంగకస ట్లనుచుంటివి. వారితని
రాయబారమును తిరస్కరింతురని యే నాతలంపు.

ఉ. వారి వచోవిలాసముల । వైఖరిగాంచమి నట్లుబల్కెదీ
వూరక, వారుపల్కునెడ । యుద్ధముకందుకకేళిపోల్కిగా
నారయునట్లు దోచు, పరు । డైననుయుద్ధమొనర్పనిల్చినన్
పోరొనరింపకేమవ । బోరు తురంగమటంచునమ్మమీ!

వారుసామాన్యులని భావించితివేమో వినుము. ఒక్కొక్కసతీమణి
యొక్కొక్క లోకపరిపాలనాభారమువహింపునంతటిశక్తియుక్తులుగల్గి
నధీరస్వాంతయని యెఱుంగుము.

ప్రద్యు—మేఘునాథునిపల్కులు వేదాక్షర ములనజెల్లును.

ఉ. ఆతరళాక్షులందమున । సచ్చరలీమలక్రిందుసేసిని
ఖ్యాతిగడించిరైనరిపు । లాజియొనర్పగ సిద్ధమైనచో
భీతివహింపబోరు, ప్రతి । పీరునిడాకిపరాక్రమింపగా
జాతురుగాని వెన్నొసగి । సుంతయు వెన్కకుపోరుసాత్యకీ.

అర్జు—అయిన మనరాయబారమును వారు తిరస్కరింతురని యేనా
మీ యభిప్రాయము?

మేఘు—తిరస్కరించుటయె కాదు. నేటయుద్ధమునికూడ ప్రకటింతురని
తలంచెదను.

ప్రద్యు—సుమతిముఖంబునసె మీరీసంగతి వాలింపగలరు.

అర్జు—అదే సుమతిమాటలలోన జనుదెంచుచున్నాడు. ఓయీ! నీకు శతాయువగును.

[ప్రవేశము సుమతి.]

సుమ—ఎందులకు- ఇంకను యిట్టిరాయబారములకనిపి పరాభవము గల్గించుటకా దీర్ఘాయుష్మంతుఁడవుగమ్మని యాశీర్వదించుట.

ప్రద్యు—నీకట్టిపరాభవముగల్గినదా! సందేశహరుండవగు నీకట్టి పరాభవమొనగూర్చినవారెవ్వరు.

అర్జు—ఓయీ!

గీ. కాలహరణంబదేల ప్ర । మీలరాణి
యశ్వరాజంబు విడచి జో । హారుసేయ
నెంచెనో యుద్ధమే నిశ్చ । యించి నిన్ను
బంపియుండెనో వేగవి । న్పింపుమయ్య.

సుమ—యుద్ధముసిద్ధమని వారుజెప్పియుండలేదు.

అర్జు—సంతోషము. అశ్వమును విడచెదమని పల్కియుండెనా? సాత్యకీ! చూచితివిగదా? మేఘనాధా! కాంతలేమో ధీర స్వాంతలనియు యుద్ధమునకే సిద్ధపడుదురనియు వచించితివే.

మేఘ—ఓయీ! అశ్వము విడచిపుత్తెంచెదమనిరా?

సుమ—అట్లనుటవారు హీనసత్వలైనపిమ్మటగదా?

ప్రద్యు—మరేమనిరి.

సుమ—తురంగము నర్జునుడెట్లు గొనిపోవునో కనుగొంటకు నిశ్చయించుకొనినారు.

అర్జు—ఏమీ! స్వపరబలంబు లరయక యుక్తాయుక్తవిచక్షణ జ్ఞానహీనలై పార్థుని సందేశము బాటింపరైరిగదా? అకారణంబుగ పార్థునితోనని సేయనెంచిన యీబలగర్వదుర్విదగ్ధులగు మానినీమణుల కిప్పుడొక మంచిపాఠము నేర్పవలయును.

వృద్ధ్య—మామా ! పిచ్చుకపై బ్రహ్మాస్త్రమనునట్లు మేమిందఱముండగా నీవు సమరంబునకు సంసిద్ధుడవై నీశపథంబునకు భంగముగలుగునట్లేల యీకాంతలతోనని సేయనెంచెదవు. మాకనుజ్ఞ యొసంగి పంపుము. క్షణంబున దురంగంబును సాధించుకొనివచ్చెదము.

మేఘ—అక్కాంతల కొక్కింతబుద్ధిగరపి సవనాశ్వమును నేనొక్కరుడనేపోయి సాధించుకొనివత్తును. మీరెల్లరును పోయిగ శిబిరముల గూరుచుండి వినోదలీలల కాలయాపన మొనరించుచుండుడు.

అర్జు—జనకుడగు ఘటోత్కచుని మరపించునంతటి శౌర్యోదారుండవగుదనుటకు సందియము లేదు. మనయోధులనెల్ల వెంటనిడుకొనిపోయిన కార్యమును సాధించు టతిసుగమమై యుండును. కావున నాపల్కులాకర్ణించి వీరలగూడ వెంటగొనిపొమ్ము.

(తెరలో భేరీనినాదము.)

అదె వైరులు రణసూచకంబుగ భేరిని మ్రోగించుచుండిరి.

ఉ. యుద్ధముసంభవించె భయ ॥ దుగ్రమహాహవమందు మీరుశౌ
ర్యోద్ధతిజూపి శాత్రవుల ॥ నొక్కటదాకుడు, పూవుబోండ్లచే
యుద్ధమునన్ బరాజయము ॥ నొందుటయే కడుహీనమట్టు మీ
బుద్ధి దలంచుడీక్షరణ ॥ భూమికిపొందు పరాక్రమింపగాన్.

రండు. తక్కంగలవారలగూడ యుద్ధసన్నద్ధులు కండని ప్రోత్సాహపరచివత్తము.

(నిష్క్రమింప తెరవాలును.)

---

## తృతీయరంగము.

స్థలము:—స్త్రీమండలప్రాంతము.

[మేఘనాథుఁడు, ప్రద్యుమ్నుడు, గదుడు, సాంబుడు, సాత్యకి మొదలగుయోధులు వీరోచితవేషముల ధరించి శస్త్రాస్త్రములను ధరించినమగో న్ముఖులై ప్రవేశింతురు.]

మేఘ—అక్కాంత లధికసాహసినులని వేరుగ వక్కాణింపవలసినది లేదు. ఎందఱెందఱు శూరులనో గాంచితినిగాని యింతటి బలగర్వితుల నెచ్చటను దిలకించియుండ లేదు.

గదు—గర్వితులకు దగినట్లు గర్వభంగ మొనరింపక విడువరాదు.

ప్రద్యు—కాన్పించిన కాంతను కనుమరుగున కేగనీయక బట్టి పల్లార్చి బంధించిగాని ముందున కేగకూడదు.

సాంబు—బంధించు టెంతులకు. జక్కాడుటే సర్వోత్తమము.

మేఘ—ఇచ్చటనిలచియే సమరోపక్రమణ మెట్లుచేయవలయునో నిర్ణయించుకొనవలయును. నేనీప్రధానద్వారముననిల్చి యిట్ల రుదెంచిన యువతీమణుల నెదుర్కొందును. ప్రద్యుమ్నా! నీవు సాంబునితో దక్షిణద్వారమును ముట్టడించుము. సాత్యకీవృష కేతులిరువురు పశ్చిమద్వారమును ముట్టడింపవలయును. గదు డుత్తరపురద్వారమును ముట్టడింపవలయును. ఇట్లు నాలుగుది క్కులనుండియు నల్వురమును దాకుటచే వారు సులభముగా నోడింపబడుదురు.

వృష—నాకీసాత్యకి సహాయమేల? నేనొక్కరుడనే యక్కార్యము ను సాధించెదను.

మేఘ—నాయనా! నీవంతటివాడవే యగుదువు. ముల్లోకైకవీరుండ గు సూర్యతనూజుని సుతుండవుగదా? అయినను నిన్నొంటి

గ రణభూమికంపవలదని నీపితృతుల్యుఁ డర్జునుఁడు మాకాజ్ఞా
పించినాడు.

వృష—పితాజ్ఞాపరిపాలన మవశ్యకర్తవ్యముగదా ?

మేఘ—తడయనేల మీరింక నియమితస్థానములకరుగుఁడు.

(మేఘనాధుఁడుగాక తక్కినవారు నిష్క్రమింతురు.)

మేఘ—ఆహా! వీరెంతటి ధీరచిత్తులు. ఎందఱెందరో దమయుక్తత దేటపడ పోవిడచిన యశ్వముకు వీరుబట్టి బంధించి సంగ్రామ మొనర్పసిద్ధమై నిలచిరి.

ఉ. ఎందఱొ బట్టి పోవిడచి । రీ తురగంబుకు వెంటవచ్చుసం
క్రిందన సూతిజూచి; సమ । రంబొనరించినవారు లేరు యీ
సుందరులెట్టి శూరులొకొ । సుంతయు భీతిలకొక నాహవం
బందున నిల్చియుండిరిమ । హాద్భుతమై గనుపట్టెనేడహా.

కానున్నది కాకమానదు. ఈలతాంగులు పగతుర నిర్జించుట కాయుధములకంటె నపాంగవీక్షణములనే యెక్కుడుగా నుపయోగింతురని తలంచెదను. అంతవఱకేల మనయోధులన్నో కంటికానిన కాంత గానబడిన తురగంబుకు కవ్వడిని విడచి దానివెనువెంటబడుటకు సందేహింపరు. మానవులగుటచే వారు సహజముగ చంచల స్వభావులు. ఇందు నేనుమాత్రి మతిజాగరూకతతో వర్తించిన కార్యసాధనము కాగలదు. కంఠముపై గత్రిబడినగాని కవ్వడికాంతలపై కార్ముకమెత్తనివాడగుటచే యిక్కార్యభారమంతయు నాశిరంబుననే నిలచియున్నది. ఇందు పురంబొకసారి జూచిన సుమతియు నాకించుక సహాయభూతుడగునని తలపోసి వెంట గొనిరానెంచియు-నొకందులకై యాతని నర్జుననితో విడచివచ్చితిని.

(తెరలో మరలభేరీధ్వని.)

ఏమోతలపోయుచు నిచ్చటనే కాలయాపన మొనరించుచున్నాడను.

భేరీధ్వని మనవారు మ్రోగించినదగును. అప్పుడే ప్రద్యుమ్నాదులు నియమితస్థానమున కేగి యుద్ధమారంభించిరి గావలయును. నేను గూడ నిక కర్తవ్యమునకు గడంగెదగాక.

(నిష్క్రమింపగా యవనిక దిగజారును.)

---

తురీయరంగము.

స్థలము:—స్త్రీమండలమందలి శిబిరము.

[స్వర్ణలత, లవంగలత, మంజరి, మంజువాణి, చిత్రరేఖ మున్నగు కాంతలు వీరోచితవేషములను ధరించి శస్త్రాస్త్రముల ధరించి సంగరోన్ముఖులై ప్రవేశింతురు ]

స్వర్ణ—చెలులారా! సంగరభూమి కేగుచు మనమిప్పుడొక్కనియమము గావించుకొనవలయును. అదేమందురా! బురుజులపై నుండి శత్రుల పోకడలుగాంచిన సైనికులు శత్రులునలువైపులనున్న ద్వారముల నొక్కరొక్కరుగా ముట్టడివేసిరని తెల్పిరి. కావున మనలో నలువురు నాలుగువాకిండ్లను రక్షించుచుండవలయును. మిగిలినవారు- ఆనలువురకును వలయునప్పుడు దోడ్పడుచు సమయమొదవిన శత్రుని దాకవలయును. ఆ యర్జును డెక్కడనుండెనో మీకెవ్వరికి దెలియవచ్చినను నాకెఱిగింపుఁడు. ఏలనన, యాతఁడు మీకు సులభముగా చేజిక్కఁడు. నేనన్ననో- యాతని నాకుగల మాయాసంగరకౌశలమున సులభముగ నోడింతును.

లవం—అట్లే చేయుదము. కాని మాలతి యింకను వచ్చినదికాదే?

మంజ—శత్రుశిబిరమున కరిగినదికదా! త్వరలో రావలయుననిన సాధ్యమగునా? ఇపుడో యింకొకఘడియకో వచ్చితీరును.

స్వర్ణ—ఆమెవచ్చువఱకు నేనిచ్చట వేచియుందును. మీరెల్లరును నలువంకల కేగి శాత్రవులదాకుడు.

(స్వర్ణలతగాక మిగిలినవారు నిష్క్రమింతురు.)

స్వర్ణ—ఇపుడు జరుగుచున్న సంగ్రామమున శక్తికొలది పోరాడి జయించిననేగాని స్త్రీలకు మున్నుగల యాధిక్యతగూడ నశించిపోవుననుటకు సందియములేదు. అర్జునునొక్కని నోడించితిమా తక్కుగల బలగమంతయును దీపికనుగాంచిన మశకంబులట్లు మావిలాసములగాంచి యుబ్బి తబ్బిబ్బుజెంది పదదాసులగుటకు సందియములేదు.

(తెరలో నించుకచప్పుడగును.)

అదే గుప్తద్వారమును తెరచుకొని మాలతి చనుదెంచుచున్నది. ఆమెవలన శత్రులరహస్యములు గొన్ని తెలియగలవు.

[ప్రవేశము—మాలతి.]

స్వర్ణ—చెలీ! విశేషములేమి?

మాల—జయముదాపైనది. విజయధ్వజమెత్తింపుము.

స్వర్ణ—అదేమే?

మాల—అధనంజయుఁడంగనలతో ననిసేయడట. కనుక నిశ్చయముగా మనకే జయంబులభింపగలదు.

స్వర్ణ—వారిముందు ప్రయత్నమేమైయుండునో గ్రహించితివా?

మాల—అంతవఱకు రానిమ్ము. మనవారొక్కరును గానరారేమి?

స్వర్ణ—యుద్ధభూమికేగిరి.

మాల—రమ్ము. మనముకూడ పోయి వీరంబులధికంబుగ బల్కిన పూరుషుల బలాదికము లెట్టివో యించుకచూతము.

(ఇరువురును నిష్క్రమింప తెరవ్రాలును.)

ద్వితీయాంకము.

# ప్రమీలార్జునీయము.

## తృతీయాంకము.

స్థలము:—యుద్ధభూమి.

[ధనుష్పాణియై సాత్యకి ప్రవేశించుచున్నాడు.]

సాత్య—ఎన్నియో యుద్ధముల దిలకించియుంటినిగాని యింతవిచిత్రమైన సంగరమెక్కడను జూచియుండలేదు. ఇంచుమించుగా యుద్ధమారంభమై నాల్గుగడియలు కావచ్చినది. కాని యొక్కబాణమైన నెగిరిన జాడ గాన్పింపదు. ఒక్కయార్తనాదమైన వినంబడదు. పొడిచెదము నరికెదమని పల్కిపాలికలనికరు దెంచిన మావీరులలో నొక్కరుడైన గాన్పింపడు. వారు గాన్పింపకున్న మానె పురంబుప్రవేశించి నలుమూలల దిమ్మరుచున్న నాకొక్క నారీమణియైనను గాన్పింపదు. అట్టియెడ బాణతూణీరముల ధరించిన ప్రయోజనమేమి ?

(తెరలో) శూరుడా ! నిలునిలుము. నీబాణతూణీరములకు దగినపని జెప్పగల మంజువాణి యిదే చనుదెంచుచున్నది.

సాత్య—అదే మూర్తీభవించిన శృంగారరసాధిదేవతయో యననొప్పు నొక్కతరుణీమణి చేత విల్లమ్ములదాల్చి యీవంకకే వచ్చుచున్నది. కుసుమపేశలగాత్రియైన నీమెశరీరము పూలమాలికలలంకరింపదగినదే గాని కోలలలంకరింపదగినదిగా గాన్పింపదు.

[ప్రవేశము-మంజువాణి.]

మంజు—వీరవరా! త్వరపడుము. వాఁడుపఱచు మహాస్త్రమునుండి శక్తియున్న దప్పించు కొనుము.

సాత్య—ఇంతలోననే మరియొకయస్త్రమా! ఇదేటిధర్మము.

మంజు—అక్లైలబల్కెదు.

సాత్య—సునిశితంబులగు చూపుతూపుల ప్రిధమమున బరపి వాని నుండి వెలువడనేరక తప్పించుచుండగా వాక్శూలమున బొడిచితివి. అంతతో నాగక- మఱియొకమహాస్త్రమున్రపయోగించుచుంటివా?

మంజు—ముదిమి హెచ్చినకొలది ముచ్చట లెక్కువగుచున్నవి గాబోలును.

సాత్య—వయసుముదిరి ప్రౌఢతకు యవ్వనమర్పించెను.

మం—వ్యర్థప్రసంగముల కాలహరణమేల?

సాత్య—అయ్యది సంతాపహేతువే.

మంజు—సంగరమొనర్ప సిద్ధమై నిలచెదవా? వేరొండుయెడ కరిగి శూరాధికులెందైన గలరేమో చూచివచ్చెదను.

సాత్య—సంగరమునకా నీవరుదెంచినది. కాని లతాంగీ! ఎండ కన్నెఱుగకుండ పోషింపబడిన నీకోమలశరీరము నిష్కారణమేలనాళిలీముఖంబుల కెఱజేసెదవు.

మంజు—ఎంతజాలిగుండెకలవాఁడవు. ముందు నీసంగతిగూడ కొంత విచారించుకొనుము.

సాత్య—ఇంకనైన నావల్కులాలించి వెడలిపొమ్ము. ఈసాత్యకితో ప్రతిఘటించి నిలుచుటనిన సామాన్యముగాదు.

మంజు—అసామాన్యమనియే దలంచితిని. ఇదే నీకిట్టి బాణములతో గాని ప్రత్యుత్తరమీయదలచుకొనలేదు. బాణము వేయును. సాత్యకి దప్పించుకొనును.

సాత్య—తరుణీమణీ! నీప్రయాసము వ్యర్థమైనదిగదా?

మంజ—(మరియొక బాణమున పింటినారి త్రెంచును) ఈబాణమేమి చేసినదో తెలిసినదా?

సాత్య—(విల్లమ్ముల పారవైచి) నీచూపుతూపులు గావించిన యెగ్గు బాణములొనరింపజాలవు. తరుణీమణీ! విల్లమ్ముల చేతధరించియుండుటచే కయ్యమునకు కాలుదువ్వితివి. ఇంక నేమిసేయుదువు. రమ్ము. బాణప్రయోగమున గల్గినశ్రమవాయనించుక విసరెదను.

మం—మంచిసొగసాయె?

సాత్య—కావలయుననియేగదా తొలుతనుండియు దేవులాడుచుంటిని. అనుగ్రహింపుము. నీయనురాగామృత మిచ్చినగాని నీవుగాయపరచిన హృదయకుహరము స్వస్థతగనజాలదు.

మం—

ఉ. అంగనలొంటి నుండ గని । నంతనె ధైర్యము వాసి వారితో
సంగజకేళి దేలుటకు । నాత్రము జెందెదు సిగ్గులేద, నే
సంగరమిమ్మటన్న నర । సంబులు వల్కెదవేల నీమహో
త్తుంగ పరాక్రమక్రమము । దోర్బలశక్తియు రిత్తవోయెనే.

ఇంత చేసితినంత జేసితి నాకురుక్షేత్రయుద్ధముననని గొప్పలు సెప్పుకొందువే. ఇదియేనా నీమగంటిమి.

సాత్య—ఎప్పటిమాటలో యిప్పుడు దడవనేల?

మంజు—ఇట్టి భీరులతో యుద్ధమున కియ్యకొనుటేల ? ఈతనికిఁ గల్గిన ప్రేమోదయము నామనంబునఁగూడ ననురాగబీజముల వెదజల్లుచున్నది.

(నిష్క్రమించును.)

సాత్య—(భ్రాంతుఁడై) అలివేణీ ! మంజువాణీ ! ననుగికురించి వెడలుచుండ మర్యాదగాదు నీ ప్రేమైకవాంఛితుఁడనగు నన్ను నీ వెనువెంట గొంపోయి యిచ్చవచ్చిన కేలుకొనుము.

(ఆమెవెనుకనే నిష్క్రమించును.)

---

ద్వితీయరంగము.

స్థలము:—యుద్ధరంగమున వేరొకదిక్కున.

[ప్రవేశము:—ప్రద్యుమ్నుఁడు ]

ప్రద్యు—నిలుకడగన్న కొత్రిక్కారుమొయిలు గుంపో యన భాసిల్లు నీతరుణీమణుల గాంచినంతనే యుద్ధము సేయుటకుమారు కౌగిలింపవలయు ననుబుద్ధి జనించుచున్నది చతుర్దశభువనంబులకెల్ల సుందరియగు రతిపై గల్గు మోహామునకంటె నీలతాంగులపైగల మోహ మగ్గల మగుచున్నది.

[ప్రవేశము:—చిత్రరేఖ ]

చిత్ర—(స్వగ) అనంగుఁడు సాంగియై సమరమున[illegible] ప్రసిద్ధుడై దర్శనీయుండై నయనంబులకు విందొనరించుచుం[illegible] (ప్రకాశము) శూరశేఖరా ! నీవేమో ముల్లోకంబుల నుత్తలపడజేయగలశక్తి యుక్తుండవట. ఏదీ నేడీ చిత్రరేఖకడ నీశౌర్య మొకింతజూపుము ?

ప్రద్యు—తన్వీమణీ ! నీయట్టి కుసుమకోమలులకు సంగరమెంతమాత్రమును దగదు. తలదాల్పవలసిన మకుటమును పాదవరాగ పాంసుల మొనరింపదగునా ?

చిత్ర—(స్వగ) ఎంతటి సరసుఁడు (ప్రకాశము) అయ్యా! అరాతివీరు డెదురుపడినపుడు జయాపజయ నిర్ణయమునకై పరస్పరబాహా బల ప్రకటనమునకై యుత్సాహంబున బోరాడవలసియుండ నిట్లేల యుపేక్ష జేసెదు.

ప్రద్యు—తరుణీమణీ! నీకటాక్షమాలికలచే గదల మెదలలేకుండ గట్టివైచి సంగర మొనరింపుమనిన భావ్యమా!

చిత్ర—ఎంతో శూరుడవనుకొంటిని. కాని భీరునిపగిది సంగరమన్న భీతిలి వెన్కకు పరుగిడుదువని తలంపనైతిని.

ప్రద్యు—నీవనుకొనినట్లు శూరుడనే యగుదునైనను నీకుమాత్రము భృత్యుడను. అట్టియెడ నీతో నని సేయదగదుగదా?

చిత్ర—విరహులున్నయెడ మాత్రము శూరుడవే యగుదువు. ఇట్టి చేతగానివాడవు చెఱకువిలు మాని కార్ముకమేల ధరించితివి. పూవుల బానవైచి శిలీముఖంబుల దాల్చితివేమి. ఉద్యానవనసీమలందు నదీసైకతశ్రేణులందు నీప్రతాపము జూపక సంగరమున కరుదెంచితివేల?

ప్రద్యు—నీయట్టి శృంగారాంగితో సరససల్లాపంబుల దేలుచు విహరించుకొరకు.

చిత్ర—చాలు చా[illegible]రకొనుము. ఎవ్వరైన విన్న నేమందురో యించుకాల[illegible]చుకొనుము.

ప్రద్యు—[illegible]న్నను ధరించెదనుగాని నీవిశ్లేషమునకుమాత్రమోర్వజాలను.

చిత్ర—ఒక్క సతీమణికి సంగరమిచ్చుటకు సందేహించి శృంగార కథాకలాపప్రకటనమున కారంభించిన నీతో నాకేటిపని.

(చిత్రరేఖ పోవుచుండ ప్రద్యుమ్నుడు వెంబడించును.)

చిత్ర—ఇంకను వెంటనరుదెంచెదవేల.

ప్రద్యు—నీయనుబంధ మాసించియుండుటచేత.

చిత్ర—అనుబంధము కావలసియున్న నాచే బంధింపబడవలయును. ఏమందువు ?

ప్రద్యు—నీయనుగ్రహాకాంక్షితుడు నీయాజ్ఞల కెదురాడునా ?

చిత్ర—(బంధించుచుండును.)

ప్రద్యు—ప్రియా ! ఈ బంధములు మందిరమున కేగునంతవఱకే గాదూ.

చిత్ర—నిక్కముగా.

ప్రద్యు — ఆవల స్వేచ్ఛావిహార లీల మనమిరువురమును వినోదింతము.

చిత్ర—ఇపుడు నా స్వేచ్ఛకేమైన భంగముకల్గినదా?

ప్రద్యు—అదికాదు.

చిత్ర—వృధాకాలహరణ మొనర్పుచు నిచ్చట గూరుచుండుటెందులకు రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము.

స్థలము:—మరియొక ప్రదేశమున.

[ప్రవేశము:—మంజరి.]

మంజ—మందబుద్ధియై పార్థుడు వెనుకముందు లో[illegible]చింపక స్త్రీలతో సంగరమునకియ్యకొనెను గాని వేరుకాద[illegible]చున్నది. ఇంతవఱకెక్కరైన మావారిపై సికశాణమైన[illegible]నట్లు గాన్పింపదు. మావారును శత్రులతో పోరాడిన జాడ సుంతయును గాన్పింపదు. యుద్ధవార్త లేమియును దెలియరావు. అదే యెవ్వరో యొకశూరుడీవంకకే జనుదెంచుచున్నవాడు. ఈతడైన ననిసేయునో లేక మాటలతో కాలయాపన మొనరించునో!

[ప్రవేశము:—సాంబుడు.]

సాంబు—(స్వగ) భూమికి దిగిన జగన్మోహినియో యన తేజరిల్లు నీ కాంతామణి లభించిన ముల్లోకపాలనంబు లభించినట్లుగా సంతసింతును. సంగరమొనర్చుటకుముం దీ లతాంగియనుగ్రహ సంపాదనార్థమై యత్నించెదగాక. (ప్రకాశము) శృంగారవతీ! కోమలంబులైన నీకరపల్లవంబులు పింఛబట్టుటకె దగునుగాని దారుణ కర్మాచరణ సాధనంబులగు కార్ముకాదులు ధరింప దగవు.

మంజు—(స్వగ) నా సోయగమును గాంచి యీతఁడు ముగ్ధుడయ్యెను. ఇంక నీతని సులభముగా నోడించి వెంటగొనిపోవచ్చును. (ప్రకాశము) శూరశిఖామణీ! జాలివంట కియ్యది సమయంబుగాదు. సంగరభూమిని యుద్ధమొనరించి శాత్రవుల నిర్జింపవలయునే కాని శత్రుజనంబులయెడ జాలివహింపదగునా? రమ్ము. యుద్ధమున నీపరాక్రమ మొకింతజూపుము.

సాం—నిన్ను జూచినంతటినుండియు సంగరముపై గల్గు నభిలాష నశించినది. మనమిరువురమును సమానవయస్కులముగదా.

ఉ. ఈడునుజోడుగల్గెనని ॥ యించుక సందియమైన లేదు, పె
ళ్ళాడగనేల వ్యర్థములు సు ॥ మాంగి! మనోభవుఁడేచుచుండె, మో
మోడక దేవిమానవంటి విను ॥ మోసతి నీపయిబాణమేయ చే
యాడదు యుద్ధమెలను జ ॥ యంబుధృవంబుగ నీదెమానినీ!

మంజ—ఓహో! ఎంతటిశూరుండవు.

సాంబు—శూరుడనో భీరుండనో. ఆసంగతి తడవనేల రమ్మారణరంగమును విడచి పురంబులోని కరుగుదము

మంజ—పురములోనికా అంతఃపురములోనికా!

సాంబు—అంతఃపురమునకు గాకున్న నీసదనమునకే గొనిపోవ్వ వల దంటినా ?

మంజ—ఎందులకైన నంగీకరింతువుగాని సంగరమోనర్పవనుమాట.

సాంబు—సంగ్రామముసంగతి యింక నె త్తవలదంటినిగదా? నీవే నన్ను జయించినట్లు లంగీకరించినను సంగ్రామ మొనర్పవలయునను చుంటివేమి.

మంజ—మంచిసరసుడవు.

సాంబు—పొరబడుచుంటివి. నీవే నెఱజాణవు. నన్ను శిక్షితునిజేసి దిద వలయును.

మంజ—నేనేది జెప్పిన నొనరింతువా ?

సాంబు—నిస్సందేహముగా నంతివఱకెొసలకీ...  పరీక్షింపుము.

మంజ—అట్లయిన  చే నీకపుడు బంధింపబడవలయును

సాంబు—బంధింపుము. (చేతులుచాపును)

మంజ—ఆతసి బంధించుచుండును.

సాంబు—హాయిహాయి ! కోమలీ! కుసుమకోమల బాహుగు ఘ పత్క కంకేజములు మేనసోకినతోడనే పరవశతగల్గెను.

మంజ—రమ్మిాదు తడయునేల

(మంజరి సాంబుని లాగుకొనిపోవుచు నిష్క్రమించును.)

[ప్రవేశము మేఘనాథుఁడు]

మేఘ—అనుకొనినట్లుగనే సైయుండనోపును. కదనరంగమునం దొక్కడేని గాన్పింపడయ్యెను ఒక్కద్వారముచె తినైననుయు ద్ధముజరిగినట్లు గాన్పింపదు. మా నారందఱును కాంతల యుం దములకాసించి విభ్రాంతులై వారికిలోబడిరి కావలయును. కార్యభారమంతయు నాతలబడినందున నెట్లైనకార్యమును సాధించి మన్ననలందవలయును. (ముందునకుజూచి) అదేయొ

కవనితామణి యిట్లరుదెంచుచున్నది. ఆమె సమీపించినతోడ నే మారుమాటాడక సంగరమొనర్ప గడంగెదను. కానియెడల నామె తనవచోవిలాసములజూపి నన్ను లోగొనయత్నించును. అట్టియెడ నెట్టిదిట్టరికైన నించుకమనంబు చలింపకుండదు. అదే దగ్గరకువచ్చుచున్నది. రానిమ్ము. సమీపించినంతనే వివిధాస్త్రములబరపి ఛించి చెండాడెదను.

[ప్రవేశము స్వర్ణలత.]

స్వర్ణ—ఛించి చెండాడెదవా? ఎవరిని.

మేఘ—నిన్నే.

స్వర్ణ—అంతపరాక్రమవంతుడవా? (నవ్వును.)

మేఘ—ఘటోత్కచకుమారుండగు నీమేఘనాధుం డలతిబలుండని తలంచితివా?

స్వర్ణ—కావుననే యింతవఱకు యుద్ధమెట్లుండెనో యెఱుంగక శిబిరమున గూరుచుంటివి.

మేఘ—(స్వగ.) ఆహా! మాటలసందర్భమునబడి కర్తవ్యమును మరచుచున్నాడను. (ప్రకాశము) తరుణీమణీ! వృధాకాలహరణమున కోర్వను. ఇంకమాటలతో ప్రత్యుత్తరమీయదలచుకొనలేదు.

స్వర్ణ—వాక్చాతురిజూపి నన్నుకొంచెపరుపవలదని హెచ్చరించుచుంటిని.

మేఘ—(గదత్రిప్పుచు.) ఈగదాదండమున నీమస్తకము శతధా ఖండింపబడును, కాచుకొనుము.

స్వర్ణ—(కత్తిద్రిప్పుచు, గదాదండమును పైకెగురగొట్టును.) చూచితివా! నీగదయేమయ్యెనో! ఇంతమాత్రమునకేనా బిరుదు పద్యముల చదువుకొంటివి.

మేఘ—(స్వగతముగ.) దండధరుదండమునైన దప్పించుకొన నలవి యగును గాని నాగదాదండము నీవలను దప్పించుకొనినవారు లేరు. అట్టియెడ, నీలతాంగి సునాయాసముగ దప్పించుకొని యెనే.

స్వర్ణ—ఎట్లువరుగిడుదునాయని యాలోచించుచుంటివా!

మేఘ—(స్వగ) మాయాసంగరమున నీమెను త్వరితముగ నోడించి త్వరితముగ కార్యసాధనకై గడంగవలయును.

(ఆకస్మికముగా నిష్క్రమించును.)

స్వర్ణ—ఛీ! ఛీ!. ఎంతచేసితివి. భీరునిపోల్కి రణభూమిని పరిత్యజించి పలాయనసూత్రమవలంబించితివా? (ఆకసమునుండి బాణములుపడును.) ఏమో! రాక్షసుడవైనందునకు పాడుబుద్ధిని వదలితివిగావు. కానిమ్ము! ఇంతమాత్రముననే వెఱతునను కొంటివి కాబోలును. ఇదే నిటలాక్షాదుల మెప్పించి వివిధశ స్త్రముల నేర్చియుంటినని గర్వించియున్న కిరీటిపై ప్రయోగింప దాచియుంచిన మాయోపహారపాటవంబగు నీశరంబున నీయాటోపంబును జిక్కపరచెదను. (అనిబాణమేయగా మేఘనాథుఁడు తూలుచు క్రిందపడును.)

స్వర్ణ—ఓయీ! మాయాయుద్ధవిశారదా? అధర్మయుద్ధ మనర్థదాయకమని యిప్పుడైన నంగీకరింతువా? లెమ్ము లెమ్ము. వాలు గైకొని పోరాడసిద్ధమగుము.

మేఘ—(స్వగ.) రూపము, రూపమునకుమించిన శౌర్యము, శౌర్యమునకువన్నెగలిగించిన విద్యాపరిణతి యొకచోగూడి యీయామె యందు మూర్తీభవించుటజూచిన నక్కజమగుచున్నది.

స్వర్ణ—లెమ్ము లెమ్ము. కార్ముకంబునో ఖడ్గమునో గైకొనుము.

మేఘ—ఓత్రిజగన్మోహినీ! నీవేయన్నిట జయించితివి. ఇంకను నం గరమెందులకు. నీయాలింగనభాగ్యమొసంగి యాదరింపుము. క్షణమైన నెడబాయక సేవించుచుందును.

స్వర్ణ—విజితులు బంధితులుగావలయును. అందులకంగీకరింతువా? సమరమొనర్పసంసిద్ధమయ్యెదవా ?

మేఘ—ప్రియా !

ఉ. ఆహవమందునోడి కుసు । మాయుధబాణికి జిక్కినాడనీ
మోహమునిల్పజాల నవ । మోహిని నీయధరామృతంబుచే
దాహముదీర్చి నన్ను పద । దాసునిగాగ గ్రహించి వేగనీ
బాహుమృణాళవల్లరుల । పంజరమందున నిల్పియేలుమా.

స్వర్ణ—బంధింపబడుట కంగీకరించితివి గావున నిన్నీరజ్జువులగట్టి తోడ్కొనిపోయెదను.

మేఘ—నీసదనమునకా? రజ్జువులెందులకు? నీమృణాళబాహువు లీమోటమానిసి దాకిన నొచ్చునని యెంచితివా? కానిమ్ము.

స్వర్ణ—(బంధించుచు.) నాసదనమున కెందులకు. నీవుండదగినసౌధమునకే గొనిపోయెదను.

మేఘ—అట నీవుండకున్న నయ్యది నరకసదృశ మగునుసుమా!

(స్వర్ణలత మేఘనాధుని లాగుకొనిపోవును.)

[లవంగలత-గదుండు-యువపురుషు చెరియొకప్రక్కనుండి ప్రవేశింతురు.]

లవంగ—(స్వగ) ఇదే యొక శూరుండరుదెంచుచున్నాడు. ఈతని నెట్లైనబట్టి బంధించి మాప్రమీలరాణికి కానుకగా నొసంగెదను.

గదు—(స్వగ) నలకూబరాన్వేషణ తత్పరమై భూలోకమునకు చను దెంచిన రంభయోయన లోకంబును మోహింపజేయు నీల తాంగి తన సౌందర్యమునకుఁ దగనియట్లు కార్ముకాదుల ధరించి సంగరమునకు జనుదెంచి యున్నది.

లవం—శూరశిఖామణీ!

ఉ. ఎత్తినవింటి నారిబిగి యించి శరావళిగప్పి శాత్రవుం
డొత్తుకొనంగలేనట్లు భుజోద్ధతిజూపి పరాక్రమింపకీ
విత్తరిబొమ్మపోల్కి చలియింపక నిల్చితివేల యుద్ధమం
దుత్తమశూరుడన్న డల యోయిచరించుట మున్నువింటిమే.

గదు—శిరీషకుసుమపేశలంబగు నీమేనిపై క్రూరశిలీముఖంబు లేయ వలసివచ్చెను. అబలవైన నిన్ను నిర్జించుటొక ఘనకార్యము కాదు.

లవంగ—నేనబలనైన నీవెంతటి సబలుండవో యొక్కింతజూపుము. యుద్ధమునకు సిద్ధమైనపిదప యెదుటబడినవారల తెగనరుకవల యునే! వీరు బలవంతులనియు, వీరుబలహీనులనియు, వీరు సుందరులనియు వీరుకురూపులనియు అందఱికన్నివంకలెన్ను చు యుద్ధముచేయకుండుట పాడియా! రమ్ము. సంగరమొనరిం పుము. ఏకార్యమునకై చనుదెంచియుంటివో యాకార్యము ను సాధించుటకై గడంగుము. లేదా! కాళ్ళకుబుద్ధిసెప్పి వ లాయనసూత్రపారాయణ మునక్రమించుము.

గదు—సెహబాస్! నారీమణీ! ఎంతపెద్దయుపన్యాసమిచ్చితివి. నీవు గ్గడించిన యీశూరధర్మమునకు మెచ్చి ముగ్దిడుకొనవలయు నను నభిలాషజనించుచున్నది.

లవంగ—మరికొంతసేపైన నింకొకకోరిక జనించునేమో త్వరప డుము.

గదు—అహా! మానినీ! వరేంగితావగాహనమునగూడ సమమైన పాండిత్యమును సంపాదించిన నిన్ను గనినంతనే యత్యధిక మగు నానందము జనియించుచున్నది. ఇంక నీయుద్ధమేల? నీకను. గన్నుల మెలంగుచుండెడ నను గ్రహింపుము.

లవం—చాలుచాలూరకొనుము. ఎవ్వరైనవిన్న నవ్విపోదురు.

గదు—ఒరులనిందాస్తుతులతో మన కేటినిమిత్తము.

లవం—ఇంతసిగ్గు విడచితి వేమి?

గదు—సిగ్గరితలే సిగ్గువిడచి సంగరమొనరింప సిద్ధపడినయెడ పురుషులు సిగ్గువిడచుట లెక్కింపదగినదికాదు.

లవం—ఇట్టి నీతో వృథాకాలయాపన మొనరింపజాలను (పోబోవును.)

గదు—(అడ్డముగాజని) నాగతి యేమగునో యించుకాలోచింపుము. అనుగ్రహింపవేని మేన ప్రాణములు నిలువవు (అని బ్రతిమాలును.)

లవంగ—(రజ్జువులచే బంధించుచు) నీకొకసంగతి గల్పించెదనురమ్ము.

గదు—నీసాన్నిధ్యము లభించిన నంతియె చాలును. కాని యిదేమి బంధించుచుంటివి ?

లవం—కలుగబోవు మహానందసూచకము లీబంధములు. రమ్ము. (అని వెంటగొనిపోవును.)

[మాలతి వడివడిగా నడచుచు ప్రవేశించును. వెనుకనుండి సుమతి ప్రియాయని యరచుచు ప్రవేశించును.]

మాల—(ఆగి స్వగ) అనురాగమన్న నీతనిదే యనురాగమనవలయును. ఘడియనుండి ముప్పాతిప్పల బెట్టుచున్నను విసువుకొనక పలకరించుచు క్షణమైన నిలువక ఆలసించిన కనుమరుగున

కరుగుదునని తలంచి వెంబడించుచున్నాను. రానిమ్ము- ఈత నినిగూడ నెట్లో చెఱసాలకు దోడ్కొనిపోయి బంధించెదను.

[ప్రవేశము- సుమతి.]

సుమ—ప్రియా ! ప్రియా ! ఎన్నిమార్లు పిలచినను వినిపించుకొనక- వెనుదిరిగియైన చూడక- యెంతదూరమిట్లీడ్చుకొనివచ్చితివి! (సమీపించి)ఇప్పటికైన ననుగ్రహముగల్గిన దంతియెచాలును.

మా—అనుగ్రహముగాదు నిగ్రహముగల్గినది.

సుమ—పోనిమ్ము. ఏదిగల్గినను మంచిదే- కాని ప్రియా ! ఒక్క-మారైనను పలుకకూడదా ! ఇంచుక గమనవేగమును తగ్గించ కూడదా ? ఇంచుకసమీపమునకు రాగూడదా ? పగవాడ ననుకొంటివా ?

మాల—ఇదేమయ్యా ! నీవుపగవాడవుగావా ?

సుమ—కాను. వంశపరంపరాగతమగు వైరము లేదనుట నీవయెఱుంగుదువుగదా ? ఇప్పటిసంగతియా ! ఆ యశ్వము నేను వాజిపేయ మొనరింప విడచినదికాదు. నీవుకూడ నద్దానిని బట్టిన దానవు కావు. నేనొకరికై వచ్చిన నీవు మీరాణికై యుద్ధమొనరింప వచ్చితివి. అంతియేకాని నీమీాద నాకుగాని నామీాద నీకుగాని పగ లేదనుటయే సిద్ధాంతము- ఇందులకుపూర్వచారిత్రమే తార్కాణము.

మాల—ఎట్లు ?

సుమ—మనమిరువురమును మిత్రులము- పరస్పరసహాయ మొందుటవలన-

మాల—అయిన నిప్పుడేమందువు ?

సుమ—మనస్నేహలతాంకురమును దోహదవిశేషమున ననురాగలతానికుంజమగునట్లొనరింప వలసినదని ప్రార్థించుచుంటిని.

మాల—అవెట్లుసంభవించును.

సుమ—అపుడి తలంచిన నాకాశమును తల్లకిందుగా జేయఁగలదు.

మా—నీపల్కులయర్థము స్ఫురించుట లేదు.

సుమ—స్ఫురింప లేదనిన పౌరుషలోపము. నీచేతనున్న కార్యమున కింతగా బ్రతిమాలించుకొనవలసిన పని లేదు. నిన్నర్థించెదను.

మా—అర్థించునదేమి ?

సుమ—(ఆత్రమున) తప్పక యొసంగెదవా ?

మా—ఏదైనచో-

సుమ—అనగా ?

మాల—ఇచ్చుకవస్తువైనచో- ముందునీవర్థించునదేమో తెల్పుము.

సుమ—లేదనిపించుకోవలసి వచ్చునేమోయను సందియము గల్గుచున్నది.

మాల—అట్టిసందియమున్న యడుగకుండుటయే మేలు-

సుమ—బాబో ! అట్లూరకొనిన కొంపమునుఁగదా ?

మాల—ఎందువలన ?

సుమ—ప్రాణము లీశరీరమును విడచి పారిపోవును. అడుగకతప్పదు. ప్రియా ! ఒక్కపరి యాలింగనభాగ్య మొసంగి యాదరింపుము.

మాల—ఈవలకు రమ్మన నిల్లాలిపై చెయివేసెననుట నేడు నీవల్ల నిజమయ్యెను. ఇంచుక చనవిచ్చినందులకు సరసములాడుటకు ప్రారంభించితివేమి ? దూరముగా నుండుము.

సుమ—(దూరమున కరిగి) కోపగించితివా ? కోపగించితివా? నీవు కోపగించిన నీ హితుని ప్రాణవాయువు లీశరీరమును విడుగలవు-నీవెట్లాజ్ఞాపించిన నట్లు నడచుకొందును. నీకనుసన్నల

మెలంగెదను. నీ స్వేచ్ఛావిహారముల కెన్నడడ్డముతగులు వాడనుగాను మన్నింపుము.

మాల—నేజెప్పినట్లెల్ల గావింతువా ?

సుమ—నిస్సంకోచముగా.

మాల—నీ వీతాళ్ళచే గట్టబడవలయును.

సుమ—ఎందులకు ?

మాల—ఇప్పుడే కొఱగానిప్రశ్నలను వేయుచుంటివి. నేను వెడలిపోయెదను.

సుమ—వలదు వలదు. నీచేతితో గట్టుము. అందువలన నవరత్న స్థగిత సువర్ణవలయములు లభించినట్లు సంతసింతును.

మాల—(బంధించుచుండును.)

[ప్రవేశము— వృషకేతుఁడు.]

వృష—(ఎదుట బంధితుడైన సుమతినిజూచి) అయ్యో ! ఇదేమి కట్టువడియుండిరి ?

సుమ—(నుదుటివ్రాతయని సంజ్ఞసేయును.)

వృష—(మాలతిని జూచి స్వగ) ఈమెయే యీతని బంధించియుండును. (ప్రకాశ) తరుణీమణీ ! యుద్ధమున నేమో యెఱుంగని సుమతిని బంధించుట యొకఘనతగాదు. ఈవృషకేతుని ముందు నీబీరములు సాగవు.

మాల—రాధేయుని నందనుండవా ? తగుదునని నీవును సమరమున కరుదెంచితివా ?

వృష—నాజనకుని రాధేయుడనిన వారి బొరిగొందునని ప్రతినబూన్చితిని. నాజనకుండు కౌంతేయుడనుట యెఱుంగవో ?

మాల—ఎంతటిశూరుండవు ! ఎంతటిపౌరుషము గలాడవు !

వృష—ఇదే యీబాణమున నీప్రాణము లెగసిపోగలవు. అపుడు నాశూరత యెఱుంగగలవు.

మాల—(ఆబాణమును చేతితో బట్టుకొనును.)

వృష—(నిర్వేదముజెంది) ఈమారు నేలగూలెదవు.

మాల—(సమీపించి వింటినిగైకొని) ఇప్పుడేమిచేయగలవు?

సుమ—ఆయుమ్మంతా! ఆడువారితో నీకు యుద్ధమేల కిరీటి కీసంగతి దెల్పుము.

మాల—చేజిక్కిన శాత్రవుని విడుమనంతటి మూఢులముగాము. (వృషకేతునిబట్టుకొని) రమ్ము మాదేవికి నిను కానుకగా సమర్పింతును.

(ఇరువురను దోడ్కొనిపోవును.)

---

## తృతీయరంగము

స్థలము—ప్రమీలదర్బారు.

[ప్రమీల సింహాసనముపై గూర్చుండియుండును స్వర్ణలత మున్నగు స్త్రీలుచితాసనాసీనలై యుందురు.

స్వర్ణ—దేవీ! ఇట్టి సంగ్రామమును మున్నెన్నడును జూచియెఱుంగము. మాచేతులకు పనిలేకుండ- నోటిమాటలతోడనే యుద్ధము సమాప్తిజెందినదని వచించిన నమ్మెదరో లేదోయను సందియము పీడించుచున్నది.

ప్రమీ—పర్యవసానమో?

లవం—విజయముగల్గియు విజితులమైతిమి.

మాల—మాప్రతాపమున కంతకు నాదాయమేకాని వ్యయములేదు.

మా—కార్ముకమెత్తకుండుటయే యగౌరవకారణము.

ప్రమీ—ఇదేమే స్వర్ణలతా! వీరిట్లనుచుండిరి.

స్వర్ణ—వారివల్కులు యథార్థములు.
ప్రమీ—ఎట్లు ?
లవం—వైరివీరుల సన్నిధికి దోడ్కొనిరానవుజ్ఞదయచేయవలయును.
(మాలతినిష్క్రమించి బంధితులతో ప్రవేశించును.)
ప్రమీ—(బంధితులగాంచి.)
గీ. అతివగొని వచ్చినట్టి బంధితులలోన
వైరి వనవాటి గాల్చెడి । పావకుండ
నగుదు నే నని గర్వించు । నట్టివాడు
అర్జునుం డెవ్వడో జూపు । మరయవలయు.
స్వర్ణ—ఇందర్జునుఁడు లేఁడు.
మాల—అమ్మా ! అత డబలలతో నని సేయడట. అందుచే రణరంగమున కైన యాతడు రాలేదు.
ప్రమీ—ఇందఱు మనచేత జిక్కియుండ నశ్వమునకై యుద్ధ మొనరింపక, వెనుకకు మరలునా ?
మాల—ముందాత డొనర్చునదేమో కనుగొనవలయును. శిబిరమున నాతనును కొలది పరిచారకులు మాత్రమేయుండిరి.
ప్రమీ—అట్లైన వీరెల్లరను బంధించియుంచుడు. అటుపై నేమి శత్రుశిబిరమున జరుగుచున్నదో వేగు నడపి తెలిసికొని తగిన ప్రతివిధానముల బన్నుఁడు. స్వర్ణలతా వీరిని గొనిపొమ్ము.
(స్వర్ణలత బంధింతులతో నిష్క్రమించును.)
ప్రమీ—అనంతరకర్తవ్యమును గూర్చి మీయభిప్రాయమేమి? ఆతఁడు హస్తినాపురమునుండి తనవారల బిలిపించుకొనియుద్ధమును మరల ప్రకటించు నని తోచుచున్నది. కాని మాలతీ! అతడెట్టివాడు. నీవాతని శిబిరమున జూచియుంటివా ? లేదా ? ఒకమా రావీరవరుని జూడవలయునను నభిలాషజనించినది.

మాల—

ఉ. చక్కదనంబునందున వసంతుని కంతుని యాజయంతునిన్
లెక్కకు గైకొనందు నరిలేని పరాక్రమమూర్తి జూడగా
నక్కజమయ్యె, నచ్చరల నైన మరుల్కొన జేయజాలునే
పెక్కు వచింపనేల పృథివీస్థలి నాతని కీడు లేరహో!

ప్రమీ—చెలులారా! మీరెల్లరును నేటికి విశ్రాంతిదీసికొని రేపకడ రండు. అపు డనంతకర్తవ్యమును గూర్చి యాలోచింతము.

(అందఱును పోవుచుందురు.)

ప్రమీ—మాలతీ! నీవుండుము. నీతో మంతనమున మాటలాడవలయును.

(మాలతినిలచును తక్కినవారు వెడలిపోవుదురు.)

ప్రమీల—మాలతీ! సమీపమునకురమ్ము. ఏమంటివి? అర్జునుడంత చక్కనివాడా! అంతటి పరాక్రమవంతుడా; అతనిజూడవలయుననియు, నాతనితో సంగరమొనర్పవలయుననియు మిక్కుటమైన యభిలాష జనించుచున్నది.

మాల—వనితలతో సంగరమొనర్పనని వ్రతమూనియుండెనే అట్టివాడు నీతోసంగ్రామ మొనరించుటకంగీకరించునా?

ప్రమీల—పోనీ! అతనిదర్శనమో!

మాల—అతడీ పురంబును ప్రవేశింప నంగీకరింపడేమో!

ప్రమీ—మనమేయాతని శిబిరమునకరిగి జూచివత్తము. ఇందులకేమైన సాధనమున్నదేమో యాలోచింపుము.

మా—ఉపాయమే లేకుండునా? (చెంతజేరి మంతనముగ నేమొ జెప్పి.) ఇట్లొనర్చిన ననుకూలముగా నుండునుగా?

ప్రమీ—మంచిదట్లే గావించుము. నీవిచ్చటికాతని బిలిపించి మాట లాడుచుండుము, నేనింతలో లోనికరిగి యుచితవేషమును ధరించివచ్చెదను.

(ప్రమీల నిష్క్రమించును.)

మా—మంజరీ ! మంజరీ !

[ప్రవేశము మంజరి.]

మాల—మంజరీ ! మొన్న రాయబారమునకైవచ్చిన సుమతిని గొని రమ్ము.

మం—ఎందులకు.

మాల—(చిరునవ్వున) తెల్పెదనులెమ్ము. కల్యాణకాలము సమీపించినది.

మం—ఆహా ! (మంజరి నిష్క్రమించును.)

మాల—ఇప్పుడీసుమతితో మనసిచ్చినట్లుగా నటించి యాతనిగొని యాతనిసహాయమున దేవికోర్కె దీర్పవలయును. వలపు తలకెక్కినవాడు చెప్పినట్లు చేయుటలో సందియమేమున్నది.

[ప్రవేశముమంజరి, సుమతి.]

మాల—మంజరీ ! ఆతని నిటవిడచి చనుము.

(మంజరి నిష్క్రమించును.)

సుమ—(ఆత్రమున నామెనుసమీపించి.) ప్రియా ! నిక్క మగు అనురాగముకల్గినదానవు నీవొక్కతవే లేకున్న బందిగమునుండి యింతత్వరలో నాకువిముక్తి గల్గింతువా ? ఇంకనిచ్చట జాల మొనరించుటెందులకు నీసదనమున కేగుదమురమ్ము.

మాల—ఊరక తొందరపడియెద వేల? యొక్కసంగతివినుము. యుద్ధ సందర్భము లా కిరీటికి నివేదింపకున్నయెడ రాజద్రోహ మొనరించిన వాడవగుదువుగదా ?

సుమ—రాజద్రోహమో దేశద్రోహమో! ఇప్పుడా విచారమెం దులకు?

మా—రాజద్రోహ మొనర్చుటకు సంకోచింపని నీవు నాయెడ మాత్ర ము విశ్వాసముతో నుందువా! కావున నీదారినీవు జూచు కొనుము.

సుమ—నీయెడద్రోహ మాచరింతునా? ఎన్నడును అట్లొనరింపనని ప్రమాణ మొనర్చెదను. లేదా యేమిచేయమందువో దెలు పుము. అట్లైయొనర్చి నీదయకు పాత్రుడనయ్యెదను.

మాల—అయిన యెడ నిప్పుడప్పార్థునికడ కేగుము.

(సుమతి పోబోవును.)

మాల—(ఆతనినిలిపి.) పోయి యేమిచేసెదవు.

సుమ—పొమ్మంటివి పోవుచుంటిని. మరల నెప్పుడురమ్మందువో గూడ జెప్పుము.

మాల—నన్నుగూడ గొనిపోవలయును.

సుమ—ప్రాణాంతము కలిగించు పనిజెప్పితివి.

మాల—నన్నేగాదు మా రాణిప్రమీలనుగూడ వెంటనిడుకొని పోవ లయును.

సుమ—అమ్మయ్యో! ఇ కేమున్నది. నన్నాయర్జునుఁడు బ్రతుక నిచ్చునా?

మా—అదేమట్లనియెదవు. మేము పురుషవేషమున జనుదెంతుము లెమ్ము!

సుమ—శత్రురహస్యముల నామూలాగ్ర మెఱుఁగుటకు నీవొక్క తెవు జాలకుందువా?

మాల—ప్రమీల యర్జునుని జూడ నెంచినది.

సుమ—ఆతనినే యిచ్చుటకు గొనివచ్చెదను. ప్రమీలమహారాణినేల శ్రమపెట్టవలయును.

మాల—అదిసరికాదు. మేమునీతోజనుదెంచి యొకమరుగుప్రదేశము ననుందుము. నీవాయర్జునుడైన శిబిరమునుండి వెలికరుదెంచునట్లు చేయుము. ఆతనిజూచినపిదప మారాణి పురములోని కేగును.

సుమ—మంచి దట్లేచేసెదను. నీయనుగ్రహసంపాదనార్థమై యగ్గినురుకుమన్న నుఱికెదను. నీకుమాత్రము నాపైకరుణ గల్గదయ్యెను.

మాల—అట్లేల తలంచెదవు.

సుమ—ఇంతతడవేకతమునఁనుంట తటస్థించినను యొక్కయాలింగనమైన ... ... ...డకొక్కముద్దైన నొసంగవైతివి.

మాల—అయ్యో! భ్రాంతుడా! మొదటనే యీసంగతి జెప్పినవలసినన్ని యొసంగియుందునే

సుమ—ఇప్పుడుమించిన దేమున్నది.

(సమీపించి ముద్దిడబోవును.)

మాల—(తప్పించుకొని) అదే ప్రమీల మనల బిలచుచున్నది. రమ్ము పోవుదము.

సుమ—ముద్దొసంగ వైతివిగదా ?

మాల—కార్యసానుకూలమైన పిమ్మట కావలసినన్ని గైకొనుము.

(వేగముగా నిరువురును నిష్క్రమింతురు.)



# ప్రమీలార్జునీయము.

## చతుర్థాంకము.

స్థలము:—అర్జునునిశిబిరము.

[ఆలోచనా తత్పరుడై యర్జునుడు ప్రవేశించును]

అర్జు—(సాలోచనముగ)

సీ. ఆహవ మొనరింప । నరిగిన వారిలో
నొకడైన తిరిగిరా । కుండు టేల
సంగ్రామమందున । జయము గల్గిన మొడ
వర్తమానంబైన । బంపరేల
ఓటమిగల్గిన । నొక్కడేనియు వచ్చి
తెలుపగా మదిలోన । దలుపడేల
తడవైన నాత్రము । దగిలియుండ దనంచు
నాత్మగతంబున । నరయు రేల

సమర మేరీతినడచెనో । శత్రులెట్టి
వ్యూహముల బన్ని మనవారి । నోహటించి
సంగర మొనర్చియుండిరో । జయమ దేరి
కయ్యెనో యని సందేహ । మందుచుంటి.

ఆశ్రమున వేచియుండునని పలుమారు జెప్పి పంపినను మేఘనాథు డు కూడ నుపేక్షవహించి వార్తబంపకుండుటచే మనంబు సందేహముచే వ్యాకుల మొందుచున్నది వీరిట్లు తడయుటచూడగా నపజయమే కల్గియుండునని తోచుచున్నది. అట్లగుటయే సంభవించినయెడల స్వయముగా నీయంగనలతో నని జేయవలసివచ్చునేమో! కాని వ్రత భంగమున కోర్తునా? లేక యధ్వరాశ్వమునకై యంగనలతో పోరాడుదునా?—ఎట్లొనరించుటకును మనస్కరింపకున్నది. పరిచారకు నొక్కని సమరరంగమునకు బంపితినిగదా? ఆతనివలన విశేషముల విని పిమ్మటగాని యెట్లొనరింపవలయునో నిర్ధారణచేయుటకు వీలుగాన్పింపదు.

[ప్రవేశము:—సుమతి]

అర్జు—ఓహో! వచ్చితివా? ఒక్కడవే చనుదెంచితివేల, మనవారెక్కడ జయములభించినను వారేల నాకువార్త బంపరైరి. మాటలాడవేల, అపజయమే గల్గినదా? ఎట్లు. మనవారెందరు కోడిపోయిరి. ఆకాంతలంతటి శౌర్యధనులా! మాటలాడవేల?

సుమ—ఎన్నిటికి సమాధాన మొసంగుదును.

అర్జు—ఒక్కటొక్కటిగా వచింపుము.

సుమ—జయాపజయ నిర్ణయ మింకను తేలలేదు.

అర్జు—అయిన మనవారెక్కడ.

సుమ—బందిగమునందు.

అర్జు—అపజయము కలిగినదనుమాటయే గదా?

సుమ—నిన్నును నన్నును గూడ వారు బంధింపగల్గినయెడ.

అర్జు—ఆకాంతలంతటి బలాధికులా?

సుమ—అది యెవ్వరుచెప్పగలరు. యుద్ధమే లేనపుడు బలాబలవిజ్ఞయ మొనరించుటెట్లు.

అర్జు—యుద్ధమే జరుగలేదా ? అయిన మనవారి నాకాంత లెట్లు బంధింతుల గావించిరి.

సుమ—మనవారే కోరి తమ్మంత తామె బంధింపబడిరి.

అర్జు—చిత్రముగానున్నదే.

సుమ—చిత్రమేమున్నది. ముల్లోకంబుల నొక్కట నుత్తలపడజేయు దర్పకు నెదిరించు టెవ్వనితరంబు, ఆయంగనలజూచిన నీవు కూడ.........నశ్వముమాట యటుంచి......

అర్జు—చాలూరకొనుము. వారెల్లరును అంగనలకు జిక్కిన నీవెట్లు తప్పించుకొంటివి?

సుమ—ఆ- నన్నే కాంతివలచుటకు సిద్ధముగానున్నది. అక్కారణము న వారిబారిబడక తప్పించుకొని వచ్చితిని. కాని ముందొనరింపబోవు కార్యమును గూర్చి యేమాలోచించితివి.

అర్జు—అందును గూర్చియే యాలోచించుచుంటిని.

సుమ—ఇందుల కొక్క యుపాయమెఱింగించెదను వినుము. ఈపురమునందలి యిరువురుపురుషులకు నీయొద్ద గొప్పయుద్యోగము లిప్పించెదనని యాసగొల్పి దోడ్కొని వచ్చితిని. వారి నాదరించితివేని ప్రమీలరాణిని జయించుటకు దగిన యుపాయమేదైన జెప్పగలరు. ఆపైన నీచిత్తము వచ్చినట్లు జేయుము.

అర్జు—వారినెచ్చట నిలిపివచ్చితివి.

సుమ—అనతిదూరముననే వలయునన్న నిముసమాత్రమున దోడ్కొనివచ్చెదను.

అర్జు—దోడ్కొనిరమ్ము.

(సుమతి నిష్క్రమించి పురుషవేషములతో నున్నమాలతిని, ప్రమీలను గొనివచ్చును.)

సుమ—వారె యర్జునసార్వభౌములు.

అర్జు—పురుషావతంసులారా! ఇయ్యాసనముల నలంకరింపుడు. మీర లేయభిప్రాయమున జనుదెంచియుంటిరో సుమతివలన లెస్స గా నెఱింగితిని. యిపుడీ నారీమణులతో సంగరమాచంచి వారివలపువలలదగుల్కొని మాపరిజనులందఱును బంధింప బడుట మీకుగూడ దెలియునుగదా!

మాల—స్త్రీలతో సమరమనర్థదాయకము.

సుమ—వారలజేయులు.

మాల—ఉపాయమున వారిని లోఁగొనవలయును.

అర్జు—మీరుపురంబును చక్కగ నెఱింగినవారగుటచే మావీరభటు లెచ్చటబంధింపబడి యుండిరో జూపగలరా?

ప్రమీల—చూపగలము.

మాల—ప్రచ్ఛన వేషము ధరించి మాతో బయలుదేరుఁడు.

సుమ—నేనుగూడ నరుదెంచెదను.

అర్జు—రమ్ము. లోనికరిగి వేషాంతరమును ధరించివత్తము.

(అర్జునుడు సుమతి-నిష్క్రమింతురు.)

ప్రమీ—(స్వగ) ఎంతటిసుందరుఁడు (ప్రకా) మాలతీ! నిక్కముగా నీతడు దర్శనీయుడుసుమా!

మాల—మోసమున నీతని నెట్టైన నీయంతఃపురంబునకు గొనివచ్చి విడచెదను.

ప్రమీ—నీఋణమెన్నటికిని దీర్చుకొన జాలను.

మాల—ఆగుము. ఆతడిట్లేవచ్చుచున్నాఁడు. మనవల్కులాలించిన మోసమురాగలదు.

[ప్రవేశము-యతివేషముధరించి సుమతియు నర్జునుడు.]

అర్జు—మిత్రులారా! రండు. పురంబుప్రవేశింపమార్గమును జూపుడు.

(అందఱును నిష్క్రమింప తెరవ్రాలును.)

---

## ద్వితీయరంగము.

### స్థలము—కారాగృహము.

[ప్రవేశము మేఘనాధుఁడు, ప్రద్యుమ్నుడు, వృషకేతుఁడు సాంబుడుమున్నగువారు.]

సాత్య—మంజువాణీ! ఎంతమాయలాడివి. అరచేతిలో తేనెవైచుకొని మోచేతివఱకు నాకించితివి. ఇట్లొనరింతువని యొకమారైన దలంపకపోతిని.

మేఘ—ముదితతో ముచ్చటలెక్క వయగు ననువచనంబులు రాఢిసేయ నీవుకూడ మాయలమారిమల్లివలపునబడితివా ?

ప్రద్యు—మీ వలచినవారు మాయలాడులగుదురు గాని నాచిత్రరేఖ శిరీషకుసుమపేశలగాత్రి,మాయామర్మము లెఱుంగనిముగ్ధ.

గదు—ముగ్ధయగుటచేతనే నిముషమున కన్నుల కారమునుచల్లి బందిగములోని కీడ్చితెచ్చినది.

మేఘ—పామరుడైన యామరు డొకింత యుపేక్ష జేసి యూరకున్న నికాంతల నేలబెట్టి కాలరాసియుందును

సాం—మన్మథుఁడే మన యవస్థకెల్ల మూలకారణము.

ప్రద్యు—చిత్రరేఖావియోగంబునబడి యహోరాత్రము లేకదీక్షతో పరితపించు నేను మీకెగ్గాచరించితి ననుచుంటిరే!

సాత్య—మన ప్రారబ్ధమున కాతడా కారణము!

గీ. ఎట్టికర్మంబుగాని తా ॥ నెఱుగకుండ
చిత్రరేఖావియోగఁబు ॥ చేతవిరహ
వార్ధినిమునింగియుండ ని ॥ ష్కారణముగ
నతని నిందింతురిది యేటి ॥ న్యాయమొక్కొ.

శరుఁడు—అవమానమన నేమో యెఱుంగని నా కిట్లవమానము గల్గించిన యాలవంగలత గాన్పించిన నామెను తుండెములుగా దెగనరకి లతను హతము జేసెదను.

సాంబ—మంజరి గాన్పించిన దానిపాలిటి కుంజరమనై మంజరిని యమమందిరమునకు తృటిలోన బంపెదను.

మేఘ—

ఉ. చేయగనున్న కార్యమును । జేయుటలోన నుపేక్షజేసి యా
మాయలమారికామినుల । మాటలు నిక్కములంచు నెంచి పు
ష్పాయుధు బారికోడి హృద । యంబులు వేగచలింప సిగ్గుసుం
తేనియులేక కట్టుబడి । యిప్పుడు చింతిల లాభమున్నదే!

అందులకై మనమెల్లరమును బంధవిముక్తి గాంచినంతటనే కసిదీర నా కాంతల జక్కాడుదము.

సాత్య—ఆకాంతలు సామాన్యలనుకొంటివా?

సీ. అఱచేతిలోననే । యాకాశమునుజూపి
క్షణమున దాసుని । గానొనర్చి
ముఖవిలాసముచేత । మోహంబుపుట్టించి
యడలివెంటను వచ్చు । నటులజేసి
కల్లమోహముజూపి । మెల్లన దరిజేరి
తమచేతితోడ బం । ధములద్గాడిగి
మాయమాటలతోడ । మత్తుమందునుచల్లి
మమత నటించుచు । మతికలంచి

గీ. ఎంతయో నేర్పుజూపించి । యింతలోన
బందిగమునందు బంధించి । భ్రీతిభగనిరి
యిట్టిసతుల వెలార్చిజ । యించుటెట్లు
బందిగమునుండియు విముక్తి । బడయుటెట్లు.

ప్రద్యు—సంఘీభావము బలమనుట యెఱుంగరో! మనమందఱమిా కవాటము నుద్ఘాటించుటకు యత్నింతము.

[ప్రవేశము—చిత్రరేఖ.]

చిత్ర—కవాటమును దన్ని బడగొట్టునంతటి సామర్థ్యమున్నదా?

ప్రద్యు—మనోహారిణీ! భవద్వియోగమును భరింపజాలక నెట్లైన నిన్ను దరిజేరవలయునని తలంచి యట్లు ప్రబోధించితిని. ఎందులకై యట్లు వీరిఁ బ్రేరేచితినో యాకార్యము నీవలన సఫలమైనది. కానయిూవీరితోనున్న యీప్రద్యుమ్నునకు నీయనురాగామృతమిచ్చి రక్షించుకొనుము.

సాం—రక్షించుటకాదు. భక్షించుటయనుము. ఇట్టి సంతగయ్యాండ్రఁ జక్కాడినను దోషములేదు.

[ప్రవేశము—మంజరి.]

మం—ఎవ్వరిఁజక్కాడెదవు.

సాం—ప్రియా! చనుదెంచితివా! భవద్వియోగభరంబునగుందుచుండ నదిగణింపక నన్నలయించుచుండిన యీమారపిశాచమును జక్కాడవలె ననుచుంటిని. నే ననినట్లుగా మనకు వివాహము జరిగినగాని యీమరునకు గర్వభంగముగాదు.

సాత్య—ఆమెను నీవుగాకున్న ఖడ్గపుత్రికమైన వివాహమాడును లెమ్ము. ఈరాకాశిమూకలే మన దురవస్థకు కారణమనుమాట మరచితివా? ఇట్టివారి నిందుండ నిచ్చుటకంటె యమపురికంపుటయే మేలు.

[ప్రవేశము మంజువాణి.]

మంజు—సాత్యకీ! ఎవ్వరిని యమసదనమున కనిపెదవు?

సాత్య—మంజువాణీ! మదచంచరీకవేణీ! వచ్చితివా? నీపైగలమోహాతిశయంబున నాప్రాణవాయువుల యమసదనమున కనుపదలంచితిని.

మేఘు—ఈమాయలమారిముండలు మనల నా యమసదనమునకే బంపుటకు దలంచియున్నారు. ఇట్టిదుశ్చరితలకా యమసదనమున తావుండదు.

[ప్రవేశము లవంగలత, స్వర్ణలత.]

స్వర్ణ—ఎవ్వరి కాయమసదనమున తావుండదనుచుంటివి?

మేఘు—వీరు మత్తులై త్రిజగన్మోహినివగు నీవుండగా నీకాంతలబెద్ద గానుతించుచు నాకెనలేని సంతాపమొనగూర్చినందులకు కోపించి వారి నట్లనుచుంటిని.

గదు—లవంగలతా! నీకటాక్షవీక్షణములకు గుఱియైనగదుడిచ్చట నున్నాడని మరువకజనుదెంచి నాప్రాణముల నిలువబెట్టితివి సుమా!

స్వర్ణ—భటులారా! బంధితులెల్లరొక్కచోనుండిన నత్యాచారమొనర్చుటకు యత్నింతురు. వీరినొక్కొక్కరినొక్కొక్కమందిరమున బంధింపుడు.

లవం—అంతవఱకెందులకు- అయోమయనిర్మితములగు నీకవాటము లుద్ఘాటింపబడునవికావు.

స్వర్ణ—చెలులారా! రండు. మనకింకనిచ్చట నేమిపనిగలదు.

(అందఱుమపోవచున్నవ్యక్తులగుచుండగా)

పురుషులందఱును—సఖీమణులారా! మాకేమిగతిజూపిపోయెదరు?

స్వర్ణ—సద్గతిగలిగించుటకే యత్నింతుము. (నిష్క్రమింతురు)

మేఘు—అయ్యో వెడలిపోయితివా?

ప్రద్యు—కట్టా! అక్కటికమూనితివా?

గదు— ఇంతదయావిహీనురాలవా?

సాం—యువతీ! నీహృదయమింతకఠినమగుటేల?

అంద—ఆహా! ఈవియోగము దుర్భరముగదా?

(మూర్ఛిల్లుదురు.)

---

తృతీయరంగము.

స్థలము:—స్త్రీమండలమునందలివీధి.

[యతివేషమున అర్జునుఁడు, సుమతి, పురుషవేషములను ధరించిన మాలతి, ప్రమీల—ప్రవేశించుచున్నారు.]

అర్జు—ఆహా! ఏమి యీపురవైభవము !

గీ. కవియొనర్చిన యట్టి స । త్కావ్యమట్ల
సరస శృంగార మెల్లెడ । జాలువాఱ
నుచితమగు నలంకారము । లొప్పుచుండ
ప్రతిభగనుచుండె నారయ యీ । పట్టణంబు.

సీ. గగనచుంబితమౌచు । గ్రహగతి దప్పించి
వెలుగొందుప్రాకార । వితతితోడ
కనులకు మిఱుమిట్లు । గల్గించి ప్రభజెందు
రత్ననిర్మితసౌధ । రాజితోడ
హాటకోపేతమై । యలరారుచున్నట్టి
రమణీయరాజమా । ర్గములతోడ
సరిలేనిమాణిక్య । సముదయదీప్తిచే
రాజితంబగు గోపు । రములతోడ
శిల్పిచాతుర్యమునుదెల్పి । చెలువుజూపు
విమలధామంబులగుకట్ట । డములతోడ
అమరవిభుపట్టణముపోల్కి । నతిశయిల్లె
నారయిద్దానివర్ణింప । నలవియగునె.

సుమతీ ! నిక్కముగా నింతసుందరమైన పట్టణమును నేనెచ్చటను గని యుండలేదు. అమరావతిగూడ నీపురీవరమున కన్నిట దక్కువయని చుడువ వచ్చును. వయస్యా ! ఈమార్గము మనమనుకొనిన ప్రదేశము నకుబోవునుకదా ?

మాల—మనము సరియైనమార్గముననే బోవుచున్నారము. కాని-
యీమార్గమున మమ్మొకింగినవారనేకులుగలరు. వారుమము
దిలకించిరా గుర్తించిపట్టుకొని మాయజమానులచెంతకుగొని
పోవుదురని తోచుచున్నది.

అర్జు—మీకట్టిభయమున్న నీమార్గముకు విడచి వేరొకమార్గమున
బోవుదము.

మాల—అటులైనచో నెక్కువదూరము నడువవలసి యుండును.

అర్జు—మీాయిచ్చవచ్చినట్లు దోడ్కొనిపొండు.

సమ—మమ్మెవ్వరైన గుర్తించి నప్పటిమాటగదా ?

ప్రమీాల—అపాయము గల్గిన నుపాయాంతరమున దప్పించుకొన
వచ్చును.

అర్జు—అటులైన నడువుడు.

(ముందుసుమతి, వెనుకనర్జునుఁడు యావెనుక మాలతి యావెనుక)
ప్రమీాల నడచుచు నిష్క్రమింతురు.)

[ప్రవేశము స్వర్ణలత.]

స్వర్ణ—ప్రమీాలయుమాలతియు యర్జుననిమాడబోయి తడవయ్యెను.
వారిట్లుజాగుచేయుటకుఁ గతమేమైయుండును. ఏమైన నగుగా
క- వారినన్వేషించుచు యర్జునుని శిబిరమునకే పోయెదగాక-
(ముందునకేగుచు) అదే ఎవ్వరో యిరువురు యతీంద్రులును-
ఇరువురు పురుషులును యిట్లరుదెంచుచున్నారు. తొలుతనరు
దెంచువాని నెచ్చటనో జూచినట్లున్నదే- సమీాపించి పరికిం
చెదగాక.

[ప్రవేశము. సుమతియర్జునుఁడు మాలతి ప్రమీాల]

స్వర్ణ—(స్వగతమున) తెలసినది. ఈతడు రాయబారమునకు వచ్చిన
సుమతి వెనకనున్నవారె ప్రమీాలయు మాలతియు. వీరినిప్పు

డు- విడదీసినగాని నడచినసంగతి సందర్భములన్నియు విశదముగా తెలియవు- (మాలతికిసంజ్ఞచేసి నిష్క్రమించును.)

అర్జు—వయస్యా ! అన్నిటికెక్కుడగు విచిత్రమొండు గాన్పించుచున్నది. తొలుతచూచినదానికంటె తరువాత దిలకించినది సౌందర్యమున నధికమై యొప్పారుచుండెను.

సుమ—(ఒకవంకకుజూపి) మిత్రమా ! చూచితివా? సువర్ణనిర్మిత కవాటములుగల్గిన యాప్రాసాదము-

(నలువురుస్త్రీలు ప్రవేశించి మాలతిని ప్రమీలను బట్టుకొందురు.)

1 స్త్రీ—నిలుడు నిలుడెక్కడకు బోయెదరు.

2 స్త్రీ—యజమానురాండ్ర గికురించిపోయిన నెట్టిశిక్షవిధింపబడునో యెటింగియు పారిపోయితిరా ?

3 స్త్రీ—ప్రమీలరాణి సామాన్యముగ విడువదు లెండు.

అర్జు—మీరీపురుషుల నేలబంధించిరి?

4 స్త్రీ—గృహావరిత్యాగ మొనరించిన వీరినిబట్టికొన రాణిగారిచే నియమింపబడితిమి.

మాల—అయ్యో ! ఎట్టిసంకటముగల్గెను.

ప్రమీ—అనుమానమే యనర్థమునకు మూలముగదా ?

మాల—(అర్జునునితో రహస్యముగా)ఆకనబడుమామిడితోపునకవ్వలనున్న భవనమే కారాగారము (పరికాశము) యతీంద్రా ! మీ సాంగత్యము నేటికి విడువనయ్యెను.

ప్రమీల—బ్రతికియుంటిమా పునర్దర్శనములభించును.

అర్జు—భటులారా ! మీ రేదికోరినను యొసంగెదను వీరినిమాత్రము బంధింపకుడు.

స్త్రీ—అయ్యా! లాభము లేదు. వీరినిసాయంకాలము లో పున రాణి యెదుటహాజరుపెట్టకున్న మాపాట్లాదైవమునకే యెఱుక.

మూ—అయ్యా! రాణిగారి యాజ్ఞ తిరస్కరింపబడినవాని మేన ప్రాణములుండవు.

స్త్రీ—కాలయాపన మేల నడువుఁడు.

(స్త్రీ భటులాపురుషరూపములనున్న ప్రమీలాలను మూల తిని వెంట గొనిపోవుదురు.)

అర్జు—భయపడినట్లుగనే వారుకట్టుబడిరి. నేనుండియు వారికెట్టిసహాయమును చేయజాలనైతిని. ఇందుల కెంతయో విచారము కలుగుచున్నది.

సుమ—ఆలోచనలతోడను గతించినవానిగూర్చి చింతించుటతోడను కాలయాపన మొనరించిన గుట్టు బట్టబయలగును. త్వరితగతి రమ్ము. కార్యసాధనమునకేమైన నవకాశము లభించునేమో చూతము.

అర్జు—మంచిది నడువుము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(తెరవ్రాలును.)

---

తురీయరంగము.

స్థలము:—ఒకవీధి.

[ప్రవేశము—లవంగలత.]

లవం—సుమతియు, నర్జునుఁడును యతివేషముల ధరించి పురంబును ప్రవేశించి యుండిరనియును వారినెట్లైన వంచించి తనయంతఃపురమునకు గొని రావలసినదనియు ప్రమీలారాణి యాజ్ఞాపించియున్నది. వారీమార్గమున బోవుచుంటిరని విని యిచ్చట నిరీక్షించుచుంటిని. ప్రమీలకు కాపార్థునిపై మక్కువ జనించినట్లు తోచుచున్నది. లేనియెడల కిరీటిని బట్టుటకు భటుల నియో

గించి యాతనిబట్టి బందిగమున బెట్టింపదా. అనురాగబీజము మొలకలెత్తుట కెంతసేపు కావలయును. అంతదూర మెందులకు మేమెల్లర మేమిచేసితిమి. నరికెదము పొడిచెదమని ప్రమీలరాణిచెంత బీరములెన్నియో పల్కి శత్రువీరులగాంచి కదనము మాటమరచి మదనకదనోచితంపు పల్కులకాలయాపనముచేసి యెట్టెటో వారిని బట్టుకొని వెంట గొనివచ్చితిమి. నిక్కముగ నాలోచించినచో కంటికానినవస్తువు గాన్పించినచో నాశించని యాడుది యుండదనుట నిక్కవము. (ముందునకుజూచి) అదే అర్జునుడు సుమతినేలకో యామార్గమున బందితానొక్కరుడె యిట్లరుదెంచుచున్నాఁడు. ఈతని నెట్లో మభ్యపరచి ప్రమీలమందిరమునకేగి గొనిపోయెదను.

[ప్రవేశము:-అర్జునుఁడు.]

లవం——మునిచంద్రమా ! నమస్కారము.

అర్జు——మనోవాంఛిత ఫలసిద్ధిరస్తు. తరుణీమణీ ! నీవెవ్వతెవు.

లవం——ఈ మండలాధికారిణియగు ప్రమీలమహారాణి సేనానాయికను. తావకసందర్శనమున ధన్యనైతిని. తమరు మా గృహమున కరుదెంచి నా యొసంగు నాతిథ్యమును గొని నా గృహమును పావనముచేయగోరుచున్నాను.

అర్జు——తరుణీమణీ ! నిష్కాములమగు మేమొకచో నిలచువారము కామని యెఱింగియు- నిట్లు మముగోరుట దగునా ? మరియు మృదువచనముల స్వాగతమిచ్చితివి. ఆహ్వానించితి వంతియె చాలును. ఆతిథ్యముకంటె నీ మృదుమధురవచనములు- నీ వినయభావమును కడుంగడు సంతసము చేకూర్చెను. కాన——

లవం—అయ్యా! మా దృశులు పావనముచేయబడుట తమవంటి వారి పాదపద్మ పరాగ లేశమునగదా! అట్టియెడ తమరు మా యొంట్ల కోర్కె నిరాకరింపదగునా ?

అర్జు—ఓ రమణీ! అన్యథా భావింపకుము.

లవం—తాపసోత్తమా! మరియొక విన్నపమాలింపుఁడు. నిన్న నేకాదశి యగుటచే నుపవసించితిని. నేఁడు ద్వాదశి యగుటచే సజ్జనులకెవ్వరికేని గుడవబెట్టక పారణసేయనను నియమముగలదు. కావున తమరు తప్పక నా గృహమునకు విచ్చేయవలయును.

అర్జు—(స్వగతమున) పంపిన సుయోగుడింకను వచ్చియుండలేదు. దిక్కుతెలియక యల్లాడుచుండుటకంటె నాయందు సదభిప్రాయముతో నరుదెంచిన యీ లతాతన్వితో నరిగి-ఆమెవలన నెమ్మదిగా నాత్మీయుల సంగతి కనుగొంటయె లెస్సయని తోచుచున్నది.

లవం—తాపసేంద్రా! ఏమాలోచించితిరి. తమ భక్తురాలిని వ్రత నియమభంగమునుండి కాపాడుటయా?

అర్జు—ఇంతగా బలవంతపరచుటచే తిరస్కరించుటకు వెనుదీయుచుంటిని. కాని- నేను నీ గృహమున చాలసేపు కూర్చుండుట కవకాశము లేదు.

లవం—మజ్జన భోజనాదుల ముగించుకొని పోడలవచ్చును. రండు. నా గృహమునకరుగుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(తెరవాలును.)

---

# ప్రమీలార్జునీయము.

## పంచమాంకము.

స్థలము:— ప్రమీలయంతఃపురము.

[ప్రమీల యొక్క సోఫాపై కూర్చుండియుండగా తెర లేచును.]

(సవిమర్శకముగా)

ప్రమీల.—

సీ. నవనాశ్వమిచటికి । చనుదెంచినంతనే
ప్రిల్మాలి మావారు । బట్టనేల
బట్టిన నేమయ్యె । ఫల్గుడంపినవార్త
విని యేల తురగంబు । విడువనైతి
ఆహవమొనరింప । నర్జునుండరుదేర
కుంకెననుచు చింత । నొందనేల
పార్థుని దిలకించు । భావముదాతలో
హృదయంబునందు జ । నింపనేల

ఇనుమడించిన తమకాన । నేగనేల
యేగి యాతని నేలయొ । క్కింతజూచి
యుంటి; చూచినమాత్రాన । నోర్వరాని
జాళిపార్థునిపైన నా । కేలగల్గె.

చే నిమిషమునం దాతని దివ్యమంగళాకృతి కంటబడినదో యా నిమిషంబున నంగజునిసందడి నా డెందంబున నారంభమయ్యెను. ఎన్నివిధముల ప్రయత్నించినను నామనంబు స్వాధీనమున నుండక పార్థుని మోహనమూర్తిపైననే నిల్చుచున్నది. అంతకంత కంతరంగంబున నతిశయించుచున్న యీ వియోగదవానలంబు చుట్టుముట్టి సమూలముగ నశింపజేయునేమో ?

ఉ. అక్కట! యీవియోగభర । మర్జునుఁగ్రమ్మఱ జూడకుండినన్
మిక్కుటమై దవాగ్నివలె । మేనునుగ్రమ్మిదహించునంటయే
నిక్కముగాగదోఁచ ధర । నీధవు సన్నిధికైన బోయి నా
యిక్కటులెల్ల దెల్పిన నో । కించుక మేలులభించునేమొకో.

ఆతని సన్నిధికరిగి ప్రార్థించిన నన్నంగీకరించునా ? ఇది యేటియాశ! మొదట గర్భశత్రుత్వమున్నటుల పోరాటమునకు సిద్ధపడి యాతని బలగమునంతను బాధించి బందెల బెట్టించిన నేను తన్ను సమీపించి ప్రార్థింప నాతడేమని భావించుకొనును. తన్ను వంచించి బంధించుటకే యిట్లు ప్రాధేయపూర్వకముగా నాతని వేడుకొనుచుంటినని భావించి తిరస్కరించును గాన నా యాశయ మందువలన దీరునట్లు దోపదు. లోకోత్తర సుందరుండైన యాతడెక్కడ నేనెక్కడ- ఆతని బడయుటెక్కడ.

సీ. కలుగునే క్రీడిము । ఖాబ్జావలోక న
మునను జనించు ప్రీ । మోదగరిమ
ప్రాప్తించునే కిరీటి । వాక్సుధామృతధార
లానజనించు నా । హ్లాదసుఖము
బడయుగునే పార్థు । ప్రణయ వారాసిలో
నుయ్యాల లూగ వెం । పొందుసుఖము

చేకూరగలదొ కో । శ్వేతవాహనుగాఁగ
లించిన యంత జ । నించుసుఖము
గీ. పార్థుడక్కడ, అతనినే । బడయుటెక్క
డక్కటక్కట నేను పే । రాశబూని
యందని పండ్లకొఱకున్నె । యఱ్ఱులెత్తు
వెంగలివిధాననుంటి దు । ర్విధికిజిక్కి.

ఆజానుబాహుఁడే, నవవికసితాంబుజపత్త్రాక్షుఁడే, ఎన్ననేల దివ్య మంగళవిగ్రహుండే, ఆతని మరచుటెట్లు. నాయీహృదయఫలకమున చిత్రింపబడిన యాతని స్వరూపమును తుడిచివేయుటెట్లు. అట్లొనరింపజాలను. ఆతని మరువజాలను. ఆతఁడే నావిభుఁడు, ఆతఁడే నా మనోహరుడు, ఆతఁడే నాజీవితసర్వస్వము. ఆతడు తిరస్కరించిన నాతని పదసరోజములకడ నాతని నామమే దివ్యనామముగా సంస్మరించుకొనుచు ప్రాణములు త్యజించెదను. అంతియెకాని గాఢముగ నల్లుకొనియున్న మోహలతను ద్రెంపి పారవైవజాలను. అర్జునుండుపురంబు ప్రవేశించెననియు, యతిరూపమున నుండెననియు, నెట్లైన నాతని నాసమ్ముఖమునకు గొనిరావలసినదనియును జెప్పి లవంగలతను బంపి యుంటిని. కాని ఇంతవఱకామె యాతనిగలసికొనెనో లేదో! ఆతఁడేమనియెనో! కట్టా! ఆతని నాలవంగలత గుర్తింపజాలకుండినను ఆతఁడు రానిరాకరించినను ఆమె చేయునదేమియును లేమిచే వెనుకకు దిరిగి వచ్చును. ఆమెయర్జుననుదీసికొని రాకున్న యెడల నామేన ప్రాణము లునిలుచునా? మాలతినే బంపియున్న నీవటికామె కార్యమును సాధించియుండును. కాని యామె కంఠస్వర మాతఁడు గుర్తించిన ననర్థము కల్గుననిగదా! యామెను బంపనైతిని. జరుగనున్న దెట్లును జరుగక

మానదని యామెనేబాపియుండవలసినది. ఇప్పుడు మించినదేమున్నది! ఇపుడు పంపిన మరుక్షణమున నాతని దోడ్కొనివచ్చును. మాలతీ, మాలతీ!!

[ప్రవేశము:—మాలతి]

మాల—అమ్మా! ఏమిసెలవు?

ప్రమీ—లవంగలత తిరిగివచ్చినదా? ఇంతగా తడవు మఱలుటచే నామె యాయర్జునయతిని గలిసికొనలేకపోయెనేమోయని తోచుచున్నది.

మాల—అమ్మా! ఇంతగా నాతొంద రేందదగునా? ఇప్పుడే యొక గడియకింతమేగదా యామెను బంపినది.

ప్రమీ—గడియయే యైనది! ఎన్నియో దినములు గడచినట్లున్నది. పోనిమ్ము ఎందులకైనను మంచిది. నేనేపోయి యాతని నిచ్చటికెల్లిన దోడ్కొనివచ్చుటకు యత్నించెదను.

మాల—అదేమమ్మా యట్లనెదవు. నీకనుసన్నలమెలంగుచు నీహిత మపేక్షించియున్న మాబోంట్లుండ నీవేల శ్రమపడవలయును. మమ్ము లాతివారిగ భావించియుంటివా? నేనేపోయి యాతని దోడ్కొనివచ్చెదను లెమ్ము.

ప్రమీ—మాలతీ! మీరు లాతివారైరని నేనంటినా? ఎంత మీకధికారిణినైనను మీకష్టసుఖముల గమనింపక నాయిష్టమువాట ముకొలది నాకార్యము నెఱవేర్చుకొను నాత్రతతో మిమ్మల యించిన మీకు కష్టముగా దోచవచ్చునని భావించి యట్లంటి నంతియెకాని వేరుకాదు కాని మాలతీ! నీవేగెదవా?

మాల—తమయాజ్ఞయైన—

ప్రమీ—మాలతీ! చూడు. విసువుకొనక ఒక్కసారి నీవేగి లవంగలత యెంతవఱకు కృతార్థురాలయ్యెనో జూచిరమ్ము. ఆమెకు

నోటి దురుసుతన మెక్కుడు. అందుచే నేమైన విరసములాడి కార్యము చెడగొట్టునేమోయని సందేహముగా నున్నది.

మాల—అట్లనే పోయివచ్చెదను. (పోవుచుండును.)

ప్రమీ—(వెనుకకు మాలతినిబిల్చి)పోవుచుంటివా? నీవు మరలి వచ్చునపుడా కిరీటినెట్లైన నిచ్చటికి దోడ్కొనిరావలయునుసుమా! త్వరితముగా రావలయును. లేనియెడల నాపైగల యాశ సంపూర్ణముగా వదలుకొనవలసినదే సుమా!

(మాలతి నిష్క్రమించును)

ప్రమీ—మాలతి మంచి నెఱజాణ! కార్యసాధనకౌశలమునందీమె కసాధ్యకార్యములు లేవు. నాకుం గడుగూర్చు సఖియగుటచే నీమె యాధన జయు నెట్లేని దోడ్కొనిరాగలదు.

[శీఘ్రియానమున ప్రవేశము మాలతి.]

ప్రమీ—మాలతీ! వచ్చితివేల? ఊరక మరలివచ్చితివా? నీతో నేమనిచెప్పి పంపితిని. అతండు వచ్చుటకు నిరాకరించెనా? లవంగలత కార్యమును చెడదీసెనా?

మాల—వచ్చుచున్నాడు.

ప్రమీ—నిక్కముగా వచ్చుచున్నాండా యర్జునుండు.

ఉ. వచ్చునె ఫల్గుణుండు, మరు । బారికి జిక్కిన నన్ను దేల్చగా
వచ్చెనటంచు జెప్పితివి । వానిని నీవెనువెంట శీఘ్రమే
దెచ్చుట మానివైచి యిటు । దెల్పగవచ్చితి వేమనందువి
వ్వచ్చుప వచ్చులోపలనె । ప్రాణముపోయిన నేమిసేతువే!

మాల—అమ్మా! రవంత యోపికపట్టుము. అతని లవంగలత వెంటనిడుకొని వచ్చుటజూచి నీకీశుభవార్త ముందుగా దెలుపవలయునని త్వరితముగా జనుదెంచితిని. కాని అమ్మా! ఆదర్పణమున నీప్రతిబింబ మొక్కమారు జూచుకొనుము. అయ్యో! ముం

గురు లెట్టు చెదరినవో! నిగనిగలాడుచు నీడగవ జాలెడి యా చెక్కుటద్దములపై నీకన్నీటి చారిక లేమి. ఇంచుక నిన్ను నీలో పున సరిజేయనిమ్ము. ఆతడియ్యది దిలకించి ప్రిప్రథమమున నేమని భావించునో.

ప్రిమా—ఏమి! అట్లుంటినా! అగునగును. రమ్ము. ఈముంగురులు నేత్రముల కడ్డుగానిలచి యమ్మారాకారుసోయగంబును తని విదీర గోలనీయక యాటంకపరచును. వీనిని కొంచెముసవ రించుము.

మాల—(ఆమె నలంకరించు చుండగా తెరలో గంటానినాదము.) అమ్మా! అదే యర్జునుడరుదెంచుచున్నాడు. నీ వీపాన్పుపై బరుండి యాతని మనోగతమెట్లుండెనో యించుక పరిశీలింపుము. నేనిదే వెడలిపోవుచుంటిని?

(మాలతి నిష్క్రమించును.)

---

## ద్వితీయరంగము.

[ప్రవేశము, లవంగలత యతివేషమునను్న యర్జునుడు.]

అర్జు—(స్వగ) పట్టణము, పట్టణములోని జనులు నివసించుసౌధము ఆ సౌధములలోని భాగములు, నొకదాని నొకటిమించి ప్రకాశించుచుండెను. దూరమునుండి చూచితినిగదా? రాజభవనము వలె గాన్పించినది. కాని పరికింపగా నియ్యదియొక సేనానాయికభవనము. ఈభవనమే యాదేవేంద్రుని భవనముకంటె మిన్నగా నున్నదిగదా ? ఆప్రమీలరాణి నివసించుమందిర మెట్లుండునో! ఆమె యెట్లుండునోగదా? (ప్రకాశముగ) లవంగలతా! ఈమందిర మొక శయ్యామందిరమువలె నున్నదేమి?

లవం—మహాభాగా! మామందిరములన్నియు నిటు లేయుండును. తమ రీయాసన మలంకరింపుడు. ఇంతలో స్నానమాచరించి వచ్చెదను.

లవం—మంచిది పోయిరమ్ము

(లవంగలత నిష్క్రమించును.)

అర్జు—అటపోయి కారాగృహమునకు మార్గమెట్లో కనుగొనిరమ్మని పంపిన సుమతి నేనిట్లరుదెంచి యుంటినని తెలియమిచే నెంత గావరితపించి యన్వేషించునోగదా? తాను మరలిచనుదెంచు వఱకైన నిలువలేదని నాపై నిందమోపునుగదా? ఏమిచేయుదును. ఈలతాంగి కోరినకోర్కె దీర్చిన నేమైన ఫలితముండునేమో యని యిచ్చటికరుదెంచితిని. కానియెడల నపాయముల కాకరమైన యిట్టిపట్టణమున ప్రచ్ఛన్నవేషముననున్న యాతని వదలియుందునా? ఈమందిరాలంకారములు నన్ను భ్రాంతుని గావించుచున్నవి. ఆచిత్రపటములు సజీవచరిత్రములవలె గాన్పించుచున్నవి. ఏవంకగనుగొనినను నిలువుటద్దములు దీపపుకాంతుల ప్రతిఫలింపజేయుచు నీమందిరాలంకారముల ద్విగుణీకృత మొనరించుచుండెను. (నలుమూలలు పరికించి సోఫాపైపరుండియున్న ప్రమీలను దిలకించి) ఈలతాంగి యెవ్వరైయుండును. చూచినకొలంది చూడవలయునను భ్రమగొల్పుచున్నదే! ఇంతటి సోయగంబుగల కాంతాశిరోమణిని నేనెన్నడును చూచి యెఱుంగను.

ఉ. కాంచితి తొల్లిస్వర్గమున । కాంతివిలాస విశేషసంపదల్
గాంచినయట్టి యచ్చరల । గాంచితి కిన్నెర సిద్ధకన్యలన్
గాంచితి నాగలోకమున । కంజదళాక్షుల గాని వారలీ
చంచలగాత్రితోడ సరి । జేయగ బోలరటంచు దోచెగా.

ఆహా! ఈమె ముల్లోకముల మోహింపజేయు జగన్మోహినియగునా? యను సందియము జనించుచున్నది.

శా. రాకాచంద్రుని గెలిసేయుమొగ, మా । రాజెళ్ళ-వాల్చూపులా
హాకందర్ప శిలీముఖంబులనుహా । స్యంబాడు, వేణీభరం
బోకాల్దువ్వను కయ్యమాడిగెలువ । పుష్పంధయశ్రేణి, లే
దీకంజాతవిశాలనేత్రి కెనయా । నేణాక్షిలోకంబులో.

కన్నులకు నేటికి సాఫల్యత లభించినది. ఇంతటి మహోత్కృష్టమాన వైభవము గల్గు కాంతామణిసందర్శనముచే కన్నులేకాక మేనంతయు యును గూడ ధన్యతగాంచి యున్నదనవచ్చును. లవంగలత చనుదెంచినతోడనే యీమె యెవ్వరో ప్రశ్నించి తెలిసికొనియెదను. కాని యీమె యాలస్యమొనరించుచున్నదే! ఇపుడేవచ్చెదనని పల్కి పోయిన యీమె జాగుమొనరించుట వింతగానున్నది.

(ప్రమీల లేచి సోఫాపై గూర్చుండును.)

అర్జు—(స్వగ) నేనటనుకొనుచుంటినో యట్లైయైనది. ఆమె చనుదెంచులోపున నీలతాంగి మేల్కాంచిన నొంటరిగా నీజవ్వనితో మాటలాడవలసివచ్చునని తలంచితిని. (ప్రకాశముగ) తరుణీమణీ! ఈసౌధమెవ్వరిది. నీవెవ్వరిదానవు?

ప్రమీ—(సోఫాపైనుండి దిగివచ్చి యర్జునుని చెంతకేగి.) మహాభాగా! తమరెవ్వరు? రాజభటపరివేష్టితమైన యీభవనంబున తమరెట్లు ప్రవేశించితిరి?

అర్జు—నేనొక సామాన్యజడదారిని. ఈయింటి యజమానురాలు నాకాతిథ్యమీయుదలంపున గొనివచ్చినది.

ప్రమీ—మహాత్మా! దీనజనవాత్సల్యులరగు తాముమాబోంట్ల ననుగ్రహించుటకు సాక్షాత్కరించుట కరుదెంచిరని వినుటకెంతయు సంతసముగల్గుచున్నది.

అర్జు—లతాంగీ! ముల్లోకంబుల నొక్కవరి మోహాసముద్రమున ముంచి యిచ్చవచ్చినట్టులాడింపగల యీత్రిజగన్మోహిని- నే సంభాషించుచున్న మానినీమణి-యీపురీవరమేలు ప్రమీల యని భావింతును.

ప్రమీ—(స్వగతము) ఈతనికిపుడు నానిజస్థితి యెఱింగించిన చుల్కనగా జూచునేమో. ఇట్లందును. (ప్రకాశముగ) అయ్యా! తామీవిషయమున నొకింత పొరపడియుండిరి. నేనామె ప్రాణసఖినగుదును. కాంచనమాల యనుదానను.

అర్జు—ఆహా! నీయట్టి త్రిజగన్మోహినులు సఖులుగాగల్గిన యాప్రమీల యెంతటి మోహినియగునోగదా? కాంచనమాలా! నీవాలవంగలత నెఱుంగుదువా?

ప్రమీ—ఆమెనానెచ్చెలి. అయిన నెందులకామె నడుగుచుంటిరి?

అర్జు—ఆమెయే నన్నిట్లు గొనివచ్చి యిటకూర్చుండబెట్టి లోనికరిగినది.

ప్రమీ—తమకెట్టి పరిచర్యవలసియున్నను, తమపదదాసినగు నావలన తమరు గ్రహించుటకు సంకోచింప బనిలేదు. మాయట్టివారి సేవనము వృథాపోదని విందుము.

అర్జు—అలివేణీ! వృథా నీవేల శ్రమజెందెదవు? కార్యాంతరాసక్తుడనై యుంటచే తడవిచ్చుట మసలుటకు వీలులేదని యామెతో నీవఱకె జెప్పియుంటిని. అక్కారణమున నామె తడయుచున్నదని ప్రశ్నించితిని.

ప్రమీ—దేవా! తమ కార్యమెట్టిదో తెలియబరుపదగిన యెడల దెలుపుడు. నావలన దీరుపనియైన-చో చేతులుకట్టుకొని చేసి మిమ్ము సంతసబరచెదను.

అర్జు—సర్వసంగపరిత్యాగులమగు మాకేటిపనులుండును. ఈపురీవరంబున గల్గువిశేషములేమైన దిలకించినతరువాత నెక్కడికైన బోవలయునని సంకల్పించుకొంటిని.

ప్రమీ—అయ్యా! తామీపట్టణము నొక్కదినమునగా దొక్కవత్సరమున జూచినను- ఒకభాగమైనను కనుగొనజాలరు. అందునను కాలినడకను బోవుచు మీరేమి చూడగలరు. ఒకవీధినైనను సమగ్రముగా జూడజాలరు. కావున మీరెట్టివైచిత్ర్యముల గననెంచితిరో యానతిండు. తత్క్షణమ మిమ్మచటికి గొనిపోవుదును.

అర్జు—(స్వగ) నిక్కముగా నీపురీవర మట్టిదియేయగును. ఈమెకు నాయెడ భక్తి యగ్గలముగా జూపట్టుచున్నది. కారాగృహమునుగూర్చి యీమెను ప్రశ్నించిన నేమనునో (ప్రకాశముగ) తరుణీమణీ! యీపురమునందలివారెవ్వరో- కారాగృహమతిరమణీయమైనదనియు, దర్శనీయమైనదనియు బల్కియుండిరి. నిక్కవమగునా?

ప్రమీ—అయ్యది దర్శనీయమైనదే. కాని యిపుడటకేగుటకు సమయముగాదు. కాని మహాత్మా! తమరు నాయభీష్టమొక్కటి దీర్చిన- మిమ్మాకారాగృహమునకే గాదు ప్రమీల సన్నిధానమునకైన నిప్పుడ కొనిపోయి విడువగలను.

అర్జు—నీయభీష్టమెయ్యది?

ప్రమీల—అనుగ్రహింతురా?

అర్జు—చేతనైనయెడల జేయక నీకేల సంతాపముగల్గింతును!

ప్రమీ—మాకు శ్రమగలుగు కార్యమును జేయుమని ప్రార్థింపను. వేయేల మీరుచేయలేనట్టి యేకార్యమును మీకుజెప్ప కుందును.

అర్జు—అట్లైన నిస్సందేహముగా నీయభీష్టమును దీర్చెదను.

ప్రమీ—అయ్యా! తమవంటివారిని మాబోంట్లర్థించు సామాన్యకార్యమునే గోరుచుంటిని.

అర్జు—నాకర్థము గాలేదు.

ప్రమీ—వీరపురుషాగ్రణీ! ఇంతమాత్రము దెలియదా? పోనిండు. విస్పష్టముగా దెల్పెదను. స్వైరవిహారిణు లీపురమందలి తరుణులని యెఱుంగుదురుకదా?

అర్జు—అయినయెడల?

ప్రమీ—(ఇంకను దెలియకుందురా! నానోట విననెంచితిరేమొ వినుఁడు. కామోపభోగముల నన్ను సంతృప్తిబరపుడు.

అర్జు—ఎంత నింద్యములగు పల్కులను వినవలసివచ్చెను. నీమాటలకు నవ్వువచ్చుచున్నది!

గీ. మూఁడులోకంబులొకపరి ౹ మోహవార్ధి
ముంచి దేల్పగలయట్టి ౹ ముగుదవీవు
సరసమననేమొ దెలియగా ౹ జాలనట్టి
యతిని రతిగోరమిగులహా ౹ స్యాస్పదంబు.

సర్వసంగపరిత్యాగులమై సంసారమునురోసిన మాబోంట్లను రతియొసంగుమని ప్రార్థించుచుంట దగదు- నీవయోరూపవిలాసములకు దగినవేరొకని వరించి సుఖంబుండుము.

ప్రమీ—తామరసనేత్రులరతినేలిన తాపసులకు వన్నెదక్కువయయ్యెనా? తపోమహాత్మ్యమున బ్రహ్మణ్యం బడైన గాధిపట్టికి మేనక చుట్టరికంబున వన్నెదొలంగెనే. పరాశరుండు మాని

యయ్యె పట్టపగటను చాళకన్యగూడ నెట్టిదొనగుగల్గెను!
ఇంతదూరమేల? అర్జునుఁడు యతిరూపంబునకాదే తొల్లి
సుభద్రను సాధించెను.

అర్జు—ఓహో! పరాత్పరస్వరూపులగువారెక్కడ- క్షుద్రుడనగు
నేనెక్కడ- అయినను పాపమని యెఱింగియు తప్పుజేయనేల.

ప్రమీ—పాపమంటివి. ఎవ్వరికాపాపము? జాలిమాలి ప్రసూన
శరముల గురియించి నిక్కటులముంచు నాపప్రసూనశరునకే
పాపముగలదు. మహాత్మా! త్వరపడవలయును. లేకున్న
నిలువజాలకున్నాను- కాషాయాంబరముల మాటుననున్న
తమసౌందర్యము నామనంబు నపహరించినది. తిరస్కరించిన
మరణమే శరణ్యమగును.

అర్జు—యువతీమణీ! నీవెంతగాప్రార్థించినను తుచ్ఛమగు నైహిక
ములపై మనసుజనింపదు.

ప్రమీ—మారజితసుందరాకారుండవగు నీవింతటి కాఠిన్య మూన
నేల? నీయభీష్టముదీర్చెదను. కారాగృహముసు జూపుట మొ
గాదు- అందున్న బంధితులకు విడుదలయొసంగెదను- వేయేల-
ధర్మజుఁడశ్వమేధమునకై విడచిన యశ్వమును- లోకోత్తర
లక్షణయుక్తమైన తురగంబునకు గూడ విడుదలయొసంగి
పుత్తెంచెదను.

అర్జు—(స్వగ) ఈమెనన్నుగుర్తించియుండెనా! యిట్లుమాటలాడుటకు!

ప్రమీ—ఇంకనైన నాప్రార్థనమాలింపుము. (సమీపించును)

అర్జు—తపస్వీమణీ! నన్నెవ్వనిగాదలంచి యిట్లుమాట్లాడుచుంటివి?

ప్రమీ—నిజవర్తమాన మెఱుంగనిదాననని తలంపకుము. తెలిపిన
ప్రయోజనములేదు. నన్నేలుకొనుము. (కౌగిలి చుకొన
బోవును)

అర్జు—(తోసివేయును) తరుణీ! నీదురాగతమునకు మేరలేకుండెనో యినదే!

[పురుషవేషముననున్న మాలతిని గెంటుకొనుచు స్వర్ణలతాదులు ప్రవేశింతురు.]

స్వర్ణ—ఏదీ! చూపు మా కైతవసన్యాసిని. శత్రులతోఁజేరినదే గాక యాతనికి జడదారిరూపమున పురముప్రవేశింపుమని బోధించితివా? కాని- లవంగలతా! ఏడే నీవుదోడ్కొనివచ్చిన జడదారి. అతఁడెవ్వఁడో నిక్కముగా పరీక్షింపవలసియున్నది.

అర్జు—(స్వగ) ఆహా! మనగుట్టుబట్టబయలైనది. ఇంకనిచ్చటనిలుచుట లగ్గుగాదు- (శీఘ్రగమనమున వేరొకమార్గమున నిష్క్రమించును.)

(ప్రమీల హా యని మూర్ఛిల్లుచుండగా స్వర్ణలతాదులు బట్టుకొని శైత్యోపచారములగావింతురు.)

మా—కట్టా! ఈమెకాయర్జునునిపైగలవలపు ద్విగుణీకృతమైనట్లు గాన్పించుచుండెను.

స్వర్ణ—లేనిపోనిబాళికల్పించుకొని విరాళిఁజెందుచున్నది.

మా—మనశీతలోపచారము లీలతాంగియెడ నిరర్థకములగుచున్నవి.

ప్రమీ—(ఇంచుకసేదదేరి) వెడలుచుంటివా! వలదు వలదు. నీమనోహారినిటు దురంతసంతాపముననుంచి యరుగుట న్యాయము కాదు.

శా. నాథా యిల్లు విచారసాగరములో । నన్ముంచిపోనుంటివా?
పాదాగ్రంబులవ్రాలి వేడినను స । ద్భావంబు జన్మింపదా?
లేదా సుందకటాక్షవీక్షబలపై । ప్రేమామృతంబైన నీ
రాదా జాలమొనర్పనేల సుకుమా । రాకార రక్షింపుమా?

స్వర్ణ—అమ్మా! ఇంతటిభ్రాంతినీకేల.

ప్రమీ—(లేచి) స్వర్ణలతా! నాకునీవెంతటిపగదాయవైతివే-ఆమహా నుభావుఁడు నాచెంతనుండఁజూచి సహింపజాలవైతివా ?

స్వర్ణ—అర్జునుఁడు నిన్ను తిరస్కరించుటజూచి సహింపక మాలతికీవేష మువైచి దోడ్కొనివచ్చితిని. లేకున్న నింకెంతటియనర్థము కల్గియుండునో.

ప్రమీ—ఎంతయవివేకివి. అందుచేనైన నాతనిస్పృశించి కొంత వేదన బాపుకొంటిని. ఆతఁడేమిచేయుననుకొంటివి. ఆతడునను సంహ రించుననుకొంటివా ? ఆతఁడు తరుణులతో యుద్ధముచేయడను ట యెఱుంగుదువే ! అట్టినీవే యంతగా నేలతొందరపడితివి ?

స్వర్ణ—మన్నింపవలయును.

లవం—అమ్మా ! ఏమనినను నీకు గోపముగాని యాతనితో నీవు ప్రమీలసఖురాల నంటివి. సత్యమే వచించియున్న మేల య్యెడిది. నిన్ను నీవు కొంచెపరచుకొని మాటలాడుటవల నను- ఆతఁడు జడదారిరూపమున నుండుటచేతను- సందే హించి నిన్ను తిరస్కరించెను. కాని యాతని తొల్లిటివాక్య ములు నిన్నాతఁడెచ్చుగా మెచ్చుకొనుట స్పష్టముగావించెను.

ప్రమీల—నిక్కువమెఱింగించినయెడల నాతఁడు తిరస్కరించిన నెక్కుడగు నవమానముపాలు గావలసివచ్చునని సందేహిం చితిని. మాలతీ ! జరిగినదేమో జరిగినది. ఇంక నాకా యర్జునునితో సాంగత్యము లభింపదు. అట్లులే జరిగినయెడల భూమిపై నిలువజాలను. ఇంక నాయాశ వదలుకొనుము. త్వరలో మీరందఱును సమావేశమై మరియొకరిని రాణిగా నెన్నుకొనుఁడు. స్వర్ణలతా ! ఇంకనీస్త్రీమండలరాజ్యసంర క్షణభారమంతయును నీవు వహింపవలయును.

మా—అమ్మా! ఈ అప్పగింతలన్నియు నిప్పుడెందులకు? కడసారి యింకొకమారు ప్రయత్నించినతరువాత చూచుకొందము.

ప్రమీ—ఇక్కడికైన పరాభవము చాలమినా యింకొకమారు యత్నించుట. ఒకమాటు మోసగింపబడిన యాతఁడు తిరుగ మోసపోవునంతటి మూర్ఖుడనియే తలంచితివా?

మా—ఇప్పుడాతని నిచ్చటికి పిలువవలయును? మనమే పోయి యాతని దర్శించి మరల వినయపూర్వకముగా ప్రార్థింతము.

స్వర్ణ—అమ్మా! అప్పటికిని యాతఁడు నిన్ను వరింపకున్న బలిమినైన యాతఁడట్లు చేయునట్లొనర్పగలము. అందులకొక చక్కని యుపాయమున్నది.

ప్రమీల—స్వర్ణలతా! ఇంకను యాశాపిశాచము నిన్నువీడి చని యుండలేదా?

ఉ. అక్కట మందబుద్ధినిటు । లయ్యెయొ బల్కెదవేల యర్జునుం
డెక్కడ వానిచెల్మిని గ । డించుట యెక్కడ చాలుచాలు నఁ
కుక్కవ నాతడేలునను । మాటదలంపకుడింక చేతికిఁ
జిక్కియ జిక్కడయ్యె తొలి । జేసినపాపము రిత్తవోవునే.

పురాకృత సంచితార్థమున నాతనిచే ద్రోపుడువడుటకే నోచుకొంటిని గాని యంతకెక్కుడు భాగ్య మనుభవించుటకు నోచుకొననైతిని. ఆహా! ఎంతగా మోసగింపబడితిని! ఆమారాకారుని సౌందర్యము నన్నెంతగా భ్రమింపజేసెను!

గీ. ఎండమావుల జలము ల । భించుననుచు
పరువులిడునట్టి హరిణశా । బకముపోల్కి
అర్జునునిపైన నేను పే । రాసబూని
యింతవలవంత నిటులగ । డించుకొంటి.

స్వర్ణ—అమ్మా! మావల్ల నాలోచింపక యాక్రందింపుము. ఉపాయాంతరమున నిరపాయముగా కార్యము సాధించుకొన చాతుర్యధురీణులమగు మేమిందర ముండియు నీకొక యొగ్గును దొల్ల జేయుదుమా! నీవే మాకు కొఱతయైన చెప్పనేల! మా జీవితములుగూడ నీలోకమునకే కొఱ యగును. నిన్ను విడచి మే మీ యిలాతలంబున నిముసమేని నిలుకనోపము.

లవం—అవ్వా! కలుమాటలేల. నేను నయామునసో భయము ననో యాధనంజయుని నీ సన్నిధికి దిరుగ దెచ్చెదము.

మాల—అమ్మా! మాలతి జీవించియేయున్నదని మరువకుము.

ప్రమీల—సఖులారా! మీరేమో యూరడింపుపల్కుల బల్కుచుండిరి. కాని యేనిముసమున కానిముసము మెక్కుడగుచున్న యీసంతాప భారము నన్నుంతవడకు నిలువనిచ్చునని తోపదు. నేనుగూడ మీతోనను దెంచి కుంచ్యుకు నురల ప్రార్థించెదను.

స్వర్ణ—అట్లొనరించుటయే మేలుగాదోచుచున్నది.

(అందఱును నిష్క్రమింప తెరవ్రాలును.)

---

తృతీయరంగము.

స్థలము:—అర్జునునిశిబిరము.

[అర్జునుకు సుమతి యుచితాసనాసీనులై కూర్చుండియుండ తెరలేచును.]

అర్జు—(సాలోచనముగా)

సీ. అగ్నికి ఖాండవం బర్పించునాడైన
నింతగా మదిని చింతింపలేదు

కురురాజు విడిపించి । గొనితెచ్చినాడైన
నింతగా మదిని చింతింపలేదు
భీష్మప్రతాపాగ్ని । వేగిననాడైన
నింతగా మదిని చింతింపలేదు
ద్రోహియా సైంధవు । ద్రుంచెడునాడైన
నింతగా మదిని చింతింపలేదు

భయదసంగ్రామమొనరించు । పట్టులందు
యింతగా నేను తొల్లి చింతించి యెఱుఁగ
కాని సహజభీరులగు యంగనలు జూపు
ప్రౌఢి పరికించి చింతింప । వలసెనేడు.

కర్తవ్యతామూఢుడనై చిక్కుకొనియుక యింతగా పరికింపవలసినదని యావిధి లిఖించియుండఁబోలును. లేకున్న నొక్కడైన నాయంగనల మాయకు జిక్కుకుందునుగదా !

సుమ—గతజలసేతుబంధన మేల ? కర్తవ్యమునుగూర్చి యాలోచింపుము. యుద్ధమొనరించిన గాని వారాయశ్వమును విడుచునట్లు దోపదు. మన మిరువురమును యుద్ధమున కాయత్తమై నిలచిన నాకాంతలు కాందిశీకతనొందకుందురా ?

అర్జు—ఇంతగా దించెంతవచ్చినను కాంతలపై కార్ముకమెత్తెదనను కొంటివా ?

సుమ—అయిన వేరొక్క సులభోపాయమును వెదుకవలయును.

(తెరలో నేదో చప్పుడగును.)

అర్జు—ఉపాయముల బన్నుటలో స్త్రీలెక్కుడు చాతుర్యముగలవారలు కాని వెలుప నేదో ధ్వనియగుచున్నది. ఎవ్వరో జూచి వచ్చెదవా ?

సుమ—ఎవ్వరును లేరు. గాలివలన నటునిటుకదలింపబడిన యాకుల చప్పుడైయుండును. కాక మనతో నెవ్వరికి పనియుండును ?

(మరల చప్పుడు.)

అర్జు—అదే పదములసవ్వడి. సుమతీ ! పోయి చూచిరమ్ము. మనకై యెవ్వరు వత్తు రనుచుంటివా ? శత్రువులు మన రహస్యముల దెలిసికొనుటకెవ్వరినైన బంపియుంచవచ్చును.

(సుమతి పోవును.)

అర్జు—ఆహా ! ఏమి యీమాయ! ఓటమియన నెట్టిదో యెఱుంగని నాకు నేటి కీయబలాజనంబులవలన నోటమి సంభవించెను. ఇంతటి ధీరస్వాంతలకును, అక్కాంచనమాలయంతటి సుందరీ మణులకును మేలికయగు నాప్రమీలరాణి యెంతటి యంద కత్తియయోగదా! అక్కాంచనమాలను గాంచియే తబ్బిబ్బు పడిననేను ప్రమీలను దర్శించియున్న నెట్టియవస్థకు జిక్కి యుదునోగదా !

[ప్రవేశము: సుమతి.]

అర్జు—సుమతీ ! వెలుపల నెవ్వరైననున్నారా ?

సుమ—ఎవ్వరో గంధర్వకాంతయట నాట్యగానాభినయచాతుర్య ధురీణయట. దర్శన మపేక్షించియున్నది.

అర్జు—గానవిశారదయా! మేలామె.లోనికి దోడ్కొనిరమ్ము. విచార సమయముల మనుజున కొకింత చిత్తస్వాస్థ్యము గల్గించు పర మౌషధము సంగీతముగదా ?

[సుమతి నిష్క్రమించి వేషాంతరంబుననున్న ప్రమీలతో ప్రవేశించును.]

అర్జు—తరుణీ! అసమయమున వచ్చితివి. అయినను నిన్ను వెనుక కేగు మనిన కించపడుదువని రప్పించితిని. స్త్రీపాపీణ్యామెక్కింత జూపి

మావీనులకు విందొనర్చుము. (స్వగతము) స్వరూపలావణ్యాతిశయము లసమానము లనవలయునుగదా !

(ప్రమీల పాడుచు నభినయము గావించును.)

అర్జు—లతాతన్వీ ! శ్రీబ్రాయము, సౌందర్యము, గానము, నాట్యకళ మున్నగునవన్నియు నీయందు మూర్తీభవించినందుల కెంతయో సంతసముగలుగుచున్నది. ఈపచ్చలపతకమును బహుమానముగా గొని చనుము

ప్రమీ—పూరుషసింహా ! ఆభరణైకవాంఛితనై తమచెంత కరుదెంచియుండలేదు.

అర్జు—అయిన నీయభీష్టమెయ్యదియో దెల్పుము.

ప్రమీల—రసికశిఖామణు లగు తమవంటివారి మెప్పువడయుటకే యిట్లు చనుదెంచియుంటిని.

అర్జు—ఆశీర్వచనముల బిడ్డలును, శాపములకు చావును, మెఱమెచ్చుల సంతృప్తియు కలుగనేర్చునే దర్శనాపేక్షజనుదెంచినని న్నూరక బంపుట మేలుగాదు. కావున నీయభీష్టము దెలుపుము. (స్వగతము) ఈమెను మి న్నెపుడో చూచియున్నట్లు తోచుచున్నది.

ప్రమీల—భూమీశా! నోరుదెరచి యడుగుటయే ప్రాణసంకటముగా నున్న, లేదనిపించుకొనిన నెట్లుండునో వేరె వచింపవలయునా ?

అర్జు—(స్వగతము) స్ఫురించినది. ఈమె యక్కాంచనమాలయైయుండనోపును. (ప్రకాశముగా) నీయభిమతమెయ్యదియో దెల్పిన తప్పక నద్దానిని నీకొసంగుటకు యత్నింతును.

ప్రమీల—మారసుందరా! మావంట్లు పూరుషసింహుల వాంఛించు నైహికముల నొసంగు మంతిమోచాలును.

అర్జు—ధూర్తురాలా ! నీయుదంతమంతయును దెలిసె. నీ వా కాంచన మాల యను ప్రమీల సఖివి కావా ?

ప్రమీల—

ఉ. ఇంకను దాపనేల ధరణీధవ! కైతవవేషమూని ని
శ్శంకత నీవు వచ్చుటను చారులు నాకెఱిగింపజూచి యీ
నాంక శిలీముఖాళి కెఱయై యట కాంచనమాలనై తి యా
టంకము లేల రమ్ము ప్రియుఁడా కరుణించి ప్రమీలనేలుసగా.

అర్జు—ఓహో తెలిసినది. నీవా ప్రమీలరాణివి? ఇట్టులనేనా రాజ్యమును పరిపాలించుచుంటివి ? సమరావని కరుదెంచిన శత్రురాజు నెట్లో మాయజేసి నీమోహాంపుటురులఁ దగుల్కొనజేసి జక్కాడ నూహించుచు టివా! ఛీఛీ! స్వైరిణీ! మానాభిమానములు లేక—

ప్రమీల—ఆగుమాగుము. నీనోటికి వచ్చినట్లు వదరకుము. మానాభిమానముల ప్రసంగమెత్తిన నీకంటె దీపికట్టువారు లేరు. శత్రురాజుల నెల్ల నిక్లే మోహమున జయింతు ననుకొంటివా? వలదు. అట్లు తలంపవలదు. వలయునేడ డాలు గైకొని నా యీ ప్రహారమును గాచుకొని యాపైన ప్రసంగింపుము. (పొడువబోవును.)

అర్జు—ఇంతగా కింకెంత జేసినను యబలవగు నీపై బాణమేయను.

ప్రమీల—(కత్తిని బారవైచి) మనోహరా! ఇట్టి క్షాత్రగుణసారవన్నుడవైనందుననే నాహృదయము నీయందు లగ్నమైనది. నిన్ను విడువజాలను. (సమీపించగా అర్జునుడు దూరమున కేగును.)

అర్జు—తరుణీమణీ! ముల్లోకంబులేకమైనను, నిర్బంధపరచినను, సూర్యచంద్రాదులు గతిదప్పినను, నేను నిన్ను ...............

(తెరలో)

ఈమెను తప్పక నీవు పరిగ్రహింపవలయును.

[నిగళబద్ధులై మేఘవర్ణాదులును స్త్రీజనంబులును ప్రవేశింతురు.]

మేఘు—నీ వీమెను పెండ్లియాడవలెను.

సాత్య—గురువరా! యీవివాహము సర్వోత్కృష్టమైనది.

ప్రద్యు—మామా! తగిన సుందరి లభించ వెనుదీయు చుంటివా?

వృష—నీ వీమెను పెండ్లియాడకున్న మాకు మరణమే శరణ్యము.

అర్జు—ఇదేమి॥మాట్లాడెదరు.

ప్రమీల—నాధా! ఇంకి నైనను పరుగాగిలుగదా! ఇట్లిందఱు నన్ను పరిగ్రహింపుమనుచుండి రే.

మేఘు—ఈమెను పెండ్లియాడకున్న యాధర్మజు డెట్లశ్వమేధ మొనరించునో జూచెదము.

ప్రద్యు—ఈహాయము సచ్చుట గట్టివైనను.

మేఘు—కి! నెచుకేల; మా మే యశ్వమేధ మొనరింతము.

అర్జు—ఇంతయాగిడె మోడైనగలదా?

సుమ—అయ్యో! ఇకదక్కదు

(ఆ దఱును బలాత్కారముగ నర్జునుని గొనిపోయి ప్రమీలరాణితో గూర్తురు)

సుమతి—ప్రమీలార్జునుల కనంతకోటి మంగళములగునుగాక.

అర్జు—తన్వీమణీ! ఈసమరమున సంపూర్ణవిజయము నీకే చేకూరియు న్నది. కావున నియమవ్రతుండ నగుటచే యశ్వమేధాంతమున గాని నిన్నుపరిగ్రహింపజాలను.

ప్రమీ—సతీమణుల ఒయించి తమసేవకై తమతో గొనిపోవుచుం టచే మీరే సంపూర్ణవిజయుల రైతిరి. మీనియమమున కెట్టి భంగమును గలుగునని దలంపకుఁడు.

శూల—అయ్యా! ఇంక నిందుండుటేల! మాపురవైభవమును దిలకింపనెంచియుంటిరే. రండు పట్టణములోని కేగుదము.

సుమ—ఇంక నిందొనర్పవలసిన దేమున్నది.

అర్జు—ఏమియునులేదు. కాని ఇట్టి విచిత్రనాటక మాడించిన యీశ్వరుని నుతించుటే పరిశిష్టము.

భరతవాక్యము.

గీ. యుద్ధములచేత యలజడి । నొందకుండ
పాడిపంటలుగల్గి భూ । వలయమెపుడు
భోగభాగ్యములొంచుచు । పొలుపుగాంచి
వెలయునట్లొనర్పగ మేశు । వేడుకొందు.

సంపూర్ణము.



శ్రీరస్తు.

# ప్రమీలార్జునీయము.

## అనుబంధములు.

### I అనుబంధము.

పేజీ 6. పంక్తి 10.

అందఱును కలసి పాడుచు పుష్పాపచయము నొనరించుచుందురు

ఆహా! ఈవనము. భోగైకసాధనము.

(1) పొన్నల బొగడల, మరిసంపెంగల
కనులకు విందుగ, గాన్పించెంగా॥ ఆహా॥

(2) జాజులమల్లెల, మరివిరజాజుల
మొల్లములైఘన, మోదమొసంగెడు॥ ఆహా॥

(3) పూచినమాత్రికలు, నేచినలతలతో
జతగొని గూర్చెడు, సంతసమహహా॥ ఆహా॥

2 అనుబంధము.

పేజీ 10. పంక్తి 10.

మేఘనాధుడు.

నాహితమును వినుమా ! తరుణీమణి నాహితమును వినుమా !

(1) తలకుమీరుపనుల కిటుల బరుగులిడిన లాభమేమి॥ నా॥

(2) హాయమునుబట్టి నిగ్రహించుటలవిగాదు మీూబోం ట్లకు
విడచిచనుము హితము గనుము తరుణీ॥ నాహి॥

స్వర్ణ:—పట్టుకొనిన హాయమునకై పెనుగులాడతగునె నీకు
చలమేలకా బలమున్న విడిపించుకు చనుము॥ పెనగు॥
తరుణీమణులగుటచేతి తడయుచుంటి నింకనైన
హాయమునొసగకున్న సమరమటంచు నెఱుగుడీ॥ తరుణీ॥

---

3 అనుబంధము.

పేజీ 12. పంక్తి 12.

సుమతి.

అహా ! ఏమీూ ! యీూపురవైభవము.

(1) కనుగొనవింతై, కానగనయ్యోడు
మేడలవరుసల, మించిచెలంగెడు॥ ఆహా॥

(2) కాంతలు పురుషుల, గనుగొనిజడియక
సరసములాడగ, దొరకొందురుగా॥ ఆహా॥

(3) పరపురుషుండను, మాటదలంపక
పరిహాసముతో, పల్కుదురహాహా ! ఆహా॥

---

4 అనుబంధము.

పేజీ 31. పంక్తి 4.

మేఘనాధుడు.

సమరముసేయగ జనుడీ, యశమును వేచేకొనుడి.

సంగరమందున, శతృలుకనుగొని
దయజూపింపక, దండనసేయుడు॥ సమ॥
దయదాక్షిణ్యంబుల్, దలుపక మదిలో
శత్రులగర్వము, సమయగజేయుడు॥ సమ॥

5 అనుబంధము.

పేజీ 33. పంక్తి 2.

స్వర్ణలత.

భండనమున దండిమగల కనుగొని వధియింపుడీ.

(1) అశ్వరములు దేహములని యాత్మదలచి రిపులతోడ
వెరువకలోక యశముగాంచ దురముసేయుడీ॥ భండ॥
(2) లోకమునను కీర్తియొకటె ప్రకటముగ నిలచుననుచు
భావమునదలపోయుచు పరిపంథులగెలువ బొందు॥ భండ॥

6 అనుబంధము.

పేజీ 36. పంక్తి 3.

మంజువాణి.

వీరాధివీరుండవౌరా !, బీరములాడగమేరా ?

(1) ఏదీనీబలమింత జూపకలో, దండమైన నెక్కడవిదేరా॥ వీరా॥
(2) అరివీరుని గాంచిన యంత, భయమందెదవిదియేరా॥ వీరా॥
(3) లెమ్మ్మ లెమ్మ్మ యుద్ధమిమ్మ్మ, తడయజాల నింకనుమ్మ్మ॥వీరా॥

## 7 అనుబంధము.

పేజీ 37. పంక్తి 5.

సాత్యకి.

విడచితివా ? ననువిడచితివా ?, నామనోహరి విడచితివా ?

జీవధనంబవు, నీవేయగుదని
భావించుటకే, ఫలమనిదలచితె॥ మనోహరి॥
పొలతీ నీకై, ప్రాణములైన
సంతోషముతోనా, నగెడువాడను॥ విడచితివా॥

---

## 8 అనుబంధము.

పేజీ 80 పంక్తి 13.

ప్రమీల.

ఇంత తెలియవా ! మనోహరా !

మనసిజరూపనీ, మరుసదయుండై
పరిపరివిధముల, బాధించుటగాని॥ నింత॥
విడువగజాల, వేడెదనిజాలా
తడయక సౌఖ్యము, లొసగగరావేలా॥ నింత॥

---

## 9 అనుబంధము.

పేజీ 80. పంక్తి 16.

అర్జునుడు.

తరుణీ ! ఈవిధి పలుకగతగునా ?

(1) సారములేని సం, సారముదోసిన
జడదారితోడ, సరసములాడగదగు నా॥ తరు॥
(2) అందచందముల, కనుకూలుడైనవాని
పొందుగోర పెం, పొందుసుఖముగాని॥ తరు॥

10 అనుబంధము.

పేజీ 88. పంక్తి 8.

ప్రమీల.

మారసుందరా! మనజాలనురా ?

విడువక పరిపరి, వేడిన నీదయ
బడయజాలకిటు, పరితపించితిని॥
నీయనురాగము, బడయుట కేవిధి
వేడుకొందునో, వేగమదెల్పుము॥

---

11 అనుబంధము.

పేజీ 90. పంక్తి 3.

అర్జునుఁడు.

అందరుచుకలసి పాడుచు ప్రవేశింతురు.

ఈలతాంగి, నేలుకొనగ
జాలమింతసలుపనేల.
మనసారగోరి ప్రీతి, మూలుచున్న యీ
ప్రమీలరాణినేలుకొనగ॥ జాల॥
దీరరానిచింతచేత, దిగులుజెందియున్న
యీప్రమీలకున్న వేరుమార్గమేమిలేదు॥

---

సవరణ.

| | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| పేజీ 71 పంక్తి 21 | ప్రాప్తించునే, | ప్రాప్తించును. |
| పేజీ 72 పంక్తి 5 | అందనిపండ్లకొఱకునై | అందగారానిపండ్లకై |